ఓమ్.

పరబ్రహ్మణే నమః.

తైత్తిరీయారణ్యకమునందుండు

# బ్రహ్మమేధమ్ (చిత్తిపన్నము.)

శ్రీ విద్యారణ్యభాష్యసహితము

ఆంధ్రప్రతిపదార్థతాత్పర్య సస్వరపాఠసమేతముగ

ఇది

మచిలీపట్టణనివాసులగు

చెల్లా నాగలింగశాస్త్రులవారి పుత్త్రులగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

వ్రాయఁబడి

బ్రహ్మశ్రీ కాపూరి రంగయ్యశాస్త్రివారిచేఁ

పరిష్కరింపఁబడి

స్వకీయశ్రీ

ఆర్యానందముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె

ప్రథమముద్రణము 500 ప్రతులు



దీని వెల 0—12—0

1936

ఓం.

పరబ్రహ్మణే నమః.

తైత్తిరీయారణ్యకమునందుండు

# బ్రహ్మమేధమ్ (పిత్రిపన్నము.)

శ్రీ విద్యారణ్యభాష్యసహితము

ఆంధ్రప్రతిపదార్థతాత్పర్య సస్వరపాఠసమేతముగ

ఇది

మచిలీపట్టణనివాసులగు

చెల్లా నాగలింగశాస్త్రులవారి పుత్త్రులగు

## లక్ష్మీనృసింహశాస్త్రిచే

వ్రాయఁబడి

బ్రహ్మశ్రీ కావూరి రంగయ్యశాస్త్రివారిచేఁ

బరిష్కరింపఁబడి

స్వకీయశ్రీ

ఆర్యానందముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె

ప్రథమముద్రణము 500 ప్రతులు



దీని వెల 0—12—0

1936




ఓమ్

# తైత్తిరీయారణ్యకే

తృతీయప్రపాఠకే ప్రథమోఽనువాకః

## బ్రహ్మమేధమ్ (లేక) చిత్తిపన్నము.

భాష్యార్థసమేతము.

---

తచ్ఛంయోరావృణీమహే। గాతుంయజ్ఞాయ। గాతుంయజ్ఞపతయే। దైవీస్స్వస్తిరస్తునః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వంజిగాతుభేషజం। శన్నోఅస్తుద్విపదే। శంచతుష్పదే॥ ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః॥

౧ అనువాకః॥ ఓం చిత్తిస్స్రుక్। చిత్తమాజ్యం। వాగ్వేదిః।ఆధీతంబర్హిః। కేతోఅగ్నిః। విజ్ఞాతమగ్నిః। వాక్పతిర్హోతా। మనఉపవక్తా। ప్రాణోహవిః। సామాధ్వర్యుః॥ ౧॥ వాచస్పతేవిధేనామన్। విధేమతేనామ। విధేస్త్వమస్మాకంనామ। వాచస్పతిస్సోమంపిబతు। ఆస్మాసునృమ్ణంధాత్స్వాహా॥ ౨॥ అధ్వర్యుఃపంచచ॥

అథ భాష్యమ్.

శ్లో॥ యస్యనిశ్వసితంవేదాయో వేదేభ్యోఖిలంజగత్।
నిర్మమేతమహంవన్దే విద్యాతీర్థమహేశ్వరమ్॥
స్వాధ్యాయబ్రాహ్మణంప్రోక్తం ద్వితీయేహిప్రపాఠకే।
చాతుర్హోత్రచితేర్మంత్రా వక్ష్యన్తేస్మిన్ప్రపాఠకే॥

భాష్యం॥ బ్రాహ్మణగ్రంధస్య తృతీయకాండే ద్వాదశ ప్రపాఠకే "బ్రహ్మావై చతుర్హోతార" ఇత్యస్మిన్ననువాకే చాతుర్హోత్రచితేర్బ్రాహ్మణముక్తం। నతుతన్మంత్రాస్తత్రోక్తాః। తేషామరణ్యేఽధ్యేతవ్యత్వాత్। అతోస్మిన్ప్రపాఠకే తన్మంత్రాఉచ్యతే। తత్రప్రథమానువాకోక్త మంత్రాణాంవినియోగా బ్రాహ్మణఏవం సమామ్నాతః। పురస్తాద్దశహోతార ముదఞ్చముపదధాతి। యావత్పదమితి। తత్ప్రాశస్త్య॥

చిత్తిస్స్రుక్... సామాన్యాస్యః॥ ౧॥ ఇతి॥ అదాసిస్సృక్షుః ప్రజాపతి స్సృష్ట్యర్థం కేనవిధానేన ఆధ్యాత్మికేనేష్టవాన్। తద్యాగవర్తిన స్స్రుగాదయః ఏతేషుమంత్రేషుప్రతిపాద్యంతే। అత్రచిత్తిచిత్త। శబ్దాభ్యాం నిర్వికల్పకసవికల్పక భేదజనకావంతః కరణవృత్తిభేదావివక్షితౌ। వాక్ ప్రసిద్ధా। ఆధీతం ఉచ్చార్యమాణం। కేతవిజ్ఞాతశబ్దాభ్యాం నిర్వికల్పకసవికల్పక జ్ఞానవిషయావభిధీయేతే। వాక్పతి శబ్దేనవాచః ప్రవర్తకః కంఠతాల్వాదిస్థానేషు సంయుజ్యమానోవాయురుచ్యతే। మనః ప్రాణౌ ప్రసిద్ధౌ। సామ శబ్దేన తద్ధేతుః స్వరోచ్చారణ శక్తిరుచ్యతే। ఏవంచిత్త్యాదయోశరీరగతాః పదార్థవిశేషాస్స్రుగాదయో దశపదార్థాహోమనిష్పాదకాః॥ అగ్ని శబ్దద్వయేనచావహనీయ గార్హపత్యావివక్షితౌ। ఉపవక్తృ శబ్దేన అనువచన కర్తుర్జ్ఞాతుః పురాప్రైషవక్తా మైత్రావరుణోవివక్షితః। యద్వాప్రోక్షణాది ష్వనుజ్ఞాయాం పృష్టాయాం బ్రహ్మన్సమిధా పేస్థితే ఓం ప్రోక్షేత్యాదినా తదనుజ్ఞాంవక్తి తస్మాదయముపవక్తా। చిత్త్యాదయశ్శరీరగతపదార్థా స్స్రుగాదిరూపాఇతివాక్యార్థః। అస్మిన్మంత్రేస్రుగాదీనాం హోమసాధనానాం దశానామభిహితత్వా దయంమంత్రోదశహోతేత్యుచ్యతే। సోయంమంత్రస్య పూర్వభాగః తస్యచావయవాః పృథగిష్టకామంత్రాః తత్ర చిత్తిస్స్రుక్... తయాదేవతయాఙ్గిరస్వద్ధ్రువాసీద "ఇతి" ఏవముపధాన మంత్రప్రకారోద్రష్టవ్యః॥ ఏతాదశేష్టకాఉపధేయాః॥ మంత్రస్యాయో యముత్తరోభాగోగ్రహాఖ్యః తేనగ్రహేష్టకాముపదధాతి। తథాచ బ్రాహ్మణమామ్నాతం। యథావకాశంగ్రహానితి। తంచగ్రహభాగ మాహ॥ ౨॥ వాచస్పతే వృష్ణంధాత్స్వాహా॥ ఇతి హేవాచస్పతే వాచః పాలక। హేవిధే జగద్విధాతః। హేనామన్- సర్వస్యవశీకర్తః। తే తవ నామ। విధేమ అస్మదనుగ్రహకారీదేవ్యాయ మిత్యేవం ప్రసిద్ధంకుర్మః। యద్వా నామా నమనం ప్రహ్వీభావంసంపాదయామః। త్వమపి అస్మాకం నామవిధేః। దేవేషుమధ్యే యజమానోయం యథా ప్రణతవానితిప్రసిద్ధింకురు। అయం వాచస్పతిః మదీయేషు సోమపానేషు సద్యశ్శోమాజ్యం పిబతు। అస్మాసుహోమకర్తృషు

న్వృష్ణం అపేక్షితంధనం అధాత్ సంపాదయతు। ఇమంవృత్తాంతముద్దిశ్య జుహుధీతి స్వకీయావాగాహ। అత్రవాచస్పత ఇత్యాది వృష్ణంధాదిత్యంతో గ్రహభాగః। ఏతేషా మంత్రాణాముపధానేవినియోగః। ప్రకరణసిద్ధ శ్చాతుర్హోత్రబ్రాహ్మణేవాచనికశ్చ। ఇత రేతువినియోగాః। తత్రతత్రవాచనికాః। తేచబ్రాహ్మణే ద్వితీయకాండే ద్వితీయతృతీయ ప్రపాఠకయోః ప్రపఞ్చితాః। తేషుహోమాహోమ విషయభేదేనకశ్చిద్విషయః ఆపస్తంబేనదర్శితః। యత్రహోమార్థాస్సంగ్రహాస్స్వాహాకారాః। యత్రాహోమార్థాః అగ్రహాశ్చ అస్వాహాకారాఇతి। సోయంన్యాయ ఉత్తరేష్వపి మంత్రేష్వనుసంధేయః। తదేవమస్మిన్ననువాకే దశహోతృమంత్రోఽభిహితః॥

ఇతి శ్రీమత్సాయనమాధవాచార్య శ్రీవిద్యారణ్యముని విరచితే వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే ప్రథమోనువాకః॥

అ॥ చిత్తిః- నిర్వికల్పమనస్సు, స్రుక్- స్రుక్కు, చిత్తం - సవికల్పకమనస్సు, ఆజ్యం నెయ్యి, వాక్-వాక్కు, వేదిః-వేదిక, అధీతం-ఉచ్చరింపబడునది, బర్హిః-బర్హిస్సు కేతః-నిర్వికల్పకజ్ఞానము, అగ్నిః-అగ్నిహోత్రము, విజ్ఞాతం-సవికల్పకజ్ఞానము, అగ్ని-అగ్నిహోత్రము, వాక్పతిః-వాయువు, హోతా-హోత, మనః-మనస్సు, ఉపవక్తా-అనువదించి పలుకువాడు, ప్రాణః-ప్రాణము, హవిః-అన్నాదిహవిస్సు, సామ-సర్వోచ్చారణశక్తి అధ్వర్యుః-అధ్వర్యుడు, వాచస్పతే-వాక్కులనుపాలించువాడా, నామక్-సర్వవశీకరణముగలవాడా, విధే-ఓస్పృష్టికర్తా, తే-నీయొక్క, నామ-పేరును, విధేమ-ప్రసిద్ధిగలదానిగాజేయుదుము, త్వం-నీవును, అస్మాకం-మాయొక్క, నామ-పేరును, విధేః-ప్రసిద్ధిని జేయుము, వాచస్పతిః-వాగధిపతి, సోమం-సోమముతో సమానమగుఆజ్యమును, పిబతు-పానముజేయుగాక, అస్మాసు-మావిషయమై, వృష్ణం-కోరబడినధనమును, ఆధాత్-సంపాదించుగాక। స్వాహా-దేవతాప్రీతినిమిత్తమగుగాక॥

తా॥ పరాయతమని లోకములో వాడుకగల బ్రాహ్మణ భాగమునందు మూడవ ప్రశ్నములో "తుభ్యంతాఅంగిరస్తమా" అనెడు పండ్రెండవ ప్రశ్నములో "బ్రహ్మవై చతుర్హోతార" అనునట్టి యనువాకమునందు చాతుర్హోత్రచయనమును గురించి బ్రాహ్మణభాగ చెప్పబడినది కాని వాని సంబంధమంత్రములక్కడ చెప్పబడలేదు. ఆ మంత్రములు ఆరణ్యక భాగమునందు చెప్పదగినవగుటవలనను ఈ ప్రశ్నమారణ్యకభాగములో చేరియుం

డుటవలనను ఈ పన్నములో నందుకు సంబంధించిన మంత్రములు చెప్పబడుచున్నవి. ఇక్కడ ప్రథమానువాకములో చెప్పఁబడిన మంత్రములకు వినియోగము "పురస్తాద్దశహోతారముదఞ్చముపదధాతి యావత్ప్రదం" అని బ్రాహ్మణములో జెప్పబడినది. దాని పాఠక్రమమెట్లనగా. ప్రళయానంతరము ప్రజాపతి తిరిగి సృష్టిజేయదలచి అందుకొఱకు నాధ్యాత్మికయజ్ఞమును ముందుగాజేసెను. అది యేవిధముగాజేసెనో తెలియవలయును కాఁబట్టి అట్టి యజ్ఞములో కావలసిన స్రుక్స్రువము వేదిక మొదలగు వస్తువిశేషములు ఈ మంత్రములలో వివరించుచున్నాడు. అదియెట్లనగా, చిత్తియనియు చిత్తమనియు రెండుపదములచే నిక్కడ మనస్సుచెప్పబడినది. చిత్తియనగా నిర్వికల్పకమైన మనస్సు దానినే నిశ్చయాత్మకమైన బుద్ధియనిచెప్పదురు అదియే హోమముజేయునట్టి స్రుక్కు. చిత్తమనగా సవికల్పకమైన మనస్సు. అదియే హోమముజేయుబడెడి ఆజ్యము వాక్కు. అదియే అగ్నిహోత్రమునుంచబడునట్టి ప్రదేశము. వేదికయని చెప్పబడును, ఆధీతమనగా నుచ్చరింపబడునది. అదియే అగ్నిహోత్రమునకు నలుప్రక్కల వేయబడునదియు మఱియు మధ్యమధ్యసమయములయందు వాడబడుచుండెడి బర్హిస్సు, కేత, అనియు విజ్ఞాత, అనియు రెండుపదములచే జ్ఞానము చెప్పబడినది. కేత, యనగా నిర్వికల్పకజ్ఞానము. అదియే ఆవహనీయాగ్ని. విజ్ఞాత, యనగా సవికల్పకజ్ఞానము, అదియే గార్హపత్యాగ్ని, వాక్పతి, యనగా వాక్కులను ప్రవర్తింపజేయునదియు కంఠము తాలువులు మొదలగు స్థానములయందు గూడియుండినట్టి వాయువు. అదియే హోత. యజ్ఞమును జేయువాడు. మనస్సు ఉపవక్త అనఁగా అనువదించి చెప్పునట్టివానికి ముందుగా ప్రైషను జెప్పునట్టి మైత్రావరుణుఁడు. లేక ప్రోక్షణాదులను జేయుటనుగురించి యనుజ్ఞను గోరుచుండగా సమీపమందుండి యీలాగుననే జేయవచ్చునని యనుజ్ఞనిచ్చువాడు ఉపవక్తయని చెప్పబడును. ప్రాణమే హోమముజేయబడెడి యన్నము పాయసము మొదలగు హవిస్సు సామయనగా స్వరమును స్మరించెడిశక్తి. అదియే, యజ్ఞమును జేయించువారిలో నొకడు. అధ్వర్యుడు, ఇట్లు శరీరమునందుండెడి చిత్తము మొదలగు పదపదార్థములు యజ్ఞమునకు సాధనములగు స్రుక్స్రువము మొదలగువానినిగా జెప్పబడెనని వాక్యార్థమైయున్నది. హోమసాధనములగు స్రువాదులు పదపదార్థము లీమంత్రమునందు జెప్పుటచేతనిది దశహోతయని చెప్పబడుచున్నది. ఇది మంత్రమునకు పూర్వభాగము. "చిత్తస్రుక్ ... [illegible]సిరస్పృగ్రవాసీద" అనువరకుమందు నవి అపూర్వభాగమునకు సశయవ [illegible]న్నవి. ఇట్లీ యుపధానమంత్రప్రకారముగ జూచుకొనవలయును.

ఈ పదిహోతలుపధానముచేయదగినవి. మంత్రమునకు గ్రహసంబంధమగు నుత్తరభాగమేదికలదో దానిచేత గ్రహేష్టకము నుపధానము చేయవలయును "యథావకాశం గ్రహాన్" అని బ్రాహ్మణములో జెప్పబడియున్నది. కాబట్టి యాగ్రహభాగమునిప్పుడు చెప్పుచున్నాము. "వాచస్పతే.....వృష్ణంధాత్స్వాహా" వాక్యములను పాలించునట్టియు సర్వమును వశీకరణజేసికొనినట్టియు నోసృష్టికర్తా! యీదేవుడు మాయందనుగ్రహముకలవాడై యుండెనని నీనామమును ప్రసిద్ధికలదానినిగాజేయుదుము. లేక నీకు విధేయులమైయుందుము. ఈ యజమానుడు యథాశాస్త్రముగ హోమమునుజేయువాడని మాయొక్క నామమును సమస్తదేవతలలోను ప్రసిద్ధికలదానిగా నీవుజేయుము. ఈ వాచస్పతి నేను జేయునట్టి యజ్ఞము మొదలగువానిలో నివ్వబడునాజ్యమును సోమపానముతో సమానమైనదానిగాదలచి గ్రహించుగాక. హోమమునుజేయునట్టి మేము కోరినధనమును మాకుసంభవింపజేయుము. అని యీప్రకారముద్దేశించి హోమమునుజేయుమని స్వకీయమగువాక్య చెప్పుచున్నది. ఇక్కడ "వాచస్పతే" అనునది మొదలు "వృష్ణంధాత్స్వాహా" అనుపర్యంతముండు గ్రంథము గ్రహభాగమైయున్నది. ఈమంత్రములకు నుపధానముజేయుటకు వినియోగము. ప్రకరణవశమువలన చాతుర్హోత్రబ్రాహ్మణమునందు నివి వాచనికములైయున్నవి. ఇతరవినియోగములైతే అక్కడక్కడ వాచనికములైయున్నవి. అవిబ్రాహ్మణములో రెండవఅష్టమునందు రెండుమూడుప్రశ్నములలో వివరించి చెప్పబడినవి. అక్కడజెప్పబడిన హోమములు అక్కడక్కడ చెప్పబడునట్టి హోమసంబంధమునననుసరించి ఆపస్తంబమునీశ్వరునిచే నొకానొకవిషయము విశదీకరింపబడినది. అది యెట్లనగా. ఎక్కడహోమమునిమిత్తము చెప్పబడినవో అవిగ్రహసంబంధమైనవియు స్వాహాకారముకలవియునగును. ఎక్కడహోమనిమిత్తమైనవి కావో అవిగ్రహసంబంధమగు నవియుకావు. స్వాహాకారముకలవియుగావు. అనిచెప్పెను ఈన్యాయము ఉత్తరత్రచెప్పబోవు మంత్రములయందును జూచుకొనవలయును. ఈ ప్రకారము చెప్పబడియున్నందున ఈయనువాకములో దశహోతృమంత్రము చెప్పబడినదిగా దెలిసికొనవలయును.

ఇట్లు శ్రీ విద్యారణ్యమునీశ్వరునిచే రచించబడిన వేదార్థప్రకాశికయను వ్యాఖ్యానముగల యజురారణ్యక తృతీయ ప్రపాఠకమునందు ప్రథమానువాకము.

## అథ ద్వితీయోనువాకః.

పృథివీ హోతా। ద్యౌరధ్వర్యుః। రుద్రోగ్నీత్। బృహస్పతిరుప

వక్తా॥ ౧॥ వాచస్పతేవాచోవీర్యేణ। సంభృతతమేనాయక్ష్యసే। యజమానాయవార్యం। ఆసువస్కరస్మై। వాచస్పతిస్సోమంపిబతి। జజనదిన్ద్రమిన్ద్రియాయస్వాహా॥ ౨॥

అథ బాష్యమ్.

అథ చతుర్హోతృమంత్రఉచ్యతే। తస్యచవినియోగో బ్రాహ్మణే చాభిహితః। దక్షిణతఃప్రాఙ్చ్యచతుర్హోతారమితి। తత్పాఠస్తు ౧॥ పృథివీ హోతా బృహస్పతిరుపవక్తా॥ ౧॥ ఇతి। సోయంహోతృభాగః। తత్ర పృథివ్యాదయః ప్రసిద్ధాః। తథాహోత్రాదయశ్చ। ఉపవక్తృశబ్దేన సమీపేస్థిత్వా తత్తత్కర్మస్వనుజానానో బ్రహ్మావివక్షితః అథగ్రహభాగమాహ॥ ౨ వాచస్పతే— జజనదింద్రమింద్రియాయస్వాహా। ౨॥ ఇతి। హేవాచస్పతే సంభృతతమేన। అత్యంతసంపాదితేన। మంత్రాత్మికాయా వాచః వీర్యేణ సామర్థ్యేన త్వమాసమంతాత్ యక్ష్యసే। అస్మై యజమానాయ వార్యం వరణీయం సువః స్వర్గం అకః ఆసమంతాత్ కురు। అయం వాచస్పతిః అస్మదీయేషు యాగేషు సోమం పిబతి। ఇన్ద్రం దేవం ఇంద్రియసమృద్ధ్యర్థం జజనత్ జనయతు। ప్రేరయత్విత్యర్థః। తదేతముద్దిశ్య జుహుధీతి సకీయావాగాహ।

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే ద్వితీయోనువాకః॥

**టీక॥ పృథివీ= భూమి, హోతా=హోతయగును, ద్యౌః=ఆకాశము, అధ్వర్యుః= అధ్వర్యుడు, రుద్రః=రుద్రుడు, అగ్నీత్=అగ్నీధ్రుడు, బృహస్పతిః= బృహస్పతి, ఉపవక్తా=బ్రహ్మ, హేవాచస్పతే=ఓవాగధిపతీ, సంభృతతమేన = విశేషముగ సంపాదించబడిన, వాచః=వాక్కులయొక్క, వీర్యేణ= బలముచేత, త్వం=నీవు, ఆ= అంతటను, యక్ష్యసే=పూజించగలవు, అస్మై=ఈ, యజమానాయ= యజమానునికొరకు, వార్యం=కోరతగిన, సువః=స్వర్గమును, అకః= అంతటనుజేయుము, అయం=ఈ, వాచస్పతిః= వాక్పతి, సోమం=సోమరసమును, పిబతి = పానముజేయుచున్నాడు, ఇంద్రం=ఇంద్రుని, ఇంద్రియాయ=ఇంద్రియములవృద్ధికొరకు, జజనత్ =పేరేపించుగాక॥**

**తా॥ ఇప్పుడుచతుర్హోతృ మంత్రముచెప్పబడుచున్నది. దానికి వినియోగము " దక్షిణతఃప్రాంచంచతుర్హోతారం " అని బ్రాహ్మణములో జెప్పబడినది. చతుర్హో**

కారవిషయమెట్లనగా, పృథివియే హోత, ఆకాశము అధ్వర్యుడు । రుద్రుడాగ్నీధ్రుడు, బృహస్పతి ఉపవక్త, అనగా బ్రహ్మ ఇట్లు హోతృభాగముచెప్పబడినది. ఇక గ్రహభాగమునుగురించి చెప్పుచున్నాడు. ఓవాగధిపతీ ! నేను మంత్రములయొక్క బలమును విశేషముగ సంపాదించి నిన్ను సేవించెదను. ఈయజమానుడు కోరునట్టి స్వర్గాదిఫలమును కలుగజేయుము. వాగధిపతి! నేనుజేయునట్టి యజ్ఞములయందు సోమరసమును పానముజేయును, ఇంద్రునింద్రియముల పుష్టినిమిత్తము ప్రేరేపించుము, అని యీప్రకారముద్దేశించి హోమముజేయుమని తనసంబంధమగు వాక్కు చెప్పుచున్నది.

## అథ తృతీయోనువాకః.

౧॥ అగ్నిర్హోతా। అశ్వినాధ్వర్యూ । త్వష్టాగ్నీత్ । మిత్ర ఉపవక్తా॥ ౧॥ ౨॥ సోమస్సోమస్యపురోగాః । శుక్రశ్శుక్రస్యపురోగాః శ్రితాస్త ఇన్ద్ర సోమాః। వాతాపేర్హవనశ్రుతస్స్వాహా॥ అగ్నిర్హోతాష్టౌ॥ ఇతి తృతీయోనువాకః। 3॥

## అథ భాష్యమ్.

అథపఞ్చహోతృమంత్రఉచ్యతే॥ తద్వినియోగో బ్రాహ్మణఏవ మామ్నాతః॥ పశ్చాదుదంచం పంచహోతారమితి॥ తత్పాఠస్తు॥ ౧॥ అగ్నిర్హోతా— మిత్రఉపవక్తా (౧) ఇతి। అగ్న్యాదయః । ప్రసిద్ధాః। అధ్వర్యూః ప్రతిప్రస్థాతా చేత్యేవ మధ్వర్యుద్విత్వేన హోతృపంచకం పూరణీయం॥ అథ గ్రహభాగమాహ॥ (౨) సోమస్సోమస్య— శ్రుతస్వాహా। (౨) ఇతి యోయ దేవతాత్మకస్సోమః సోయంలతాత్మకస్య యాగదేశం ప్రత్యాగమనేపురతో గచ్ఛతి । శుక్రః భాసకో దేవతాది ప్రకాశకో మంత్రః శుక్రస్య గృహ్యమాణ తయాభాసమానస్య సోమస్య పురతో గచ్ఛతి ఆదావమంత్రపఠిత్వా పశ్చాత్సోమోగృహ్యతే హేఇంద్ర- తే- త్వదర్థం- ఏతే- సోమాః- శ్రితాః- పక్వాః - ఆశ్రితా వా కీదృశస్య తే। వాయువదాప్నోతి సహసాగచ్ఛతీతి - వాతాపిః- తస్య। హవనమాహ్వానం శృణుతీతి హవనశ్రుత్ - తస్య ఏతదర్థం-జుహుధీతి స్వకీయావాగాహ॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే తృతీయోనువాకః.

టీక॥ అగ్నిః-అగ్నిహోతృడు, హోతా-హోతయగును, అశ్వినా-అశ్వినీదేవతలు, అధ్వర్యూ-అధ్వర్యులు, త్వష్టా-బ్రహ్మ, అగ్నీత్-అగ్నీధ్రుడు, మిత్రః-సూర్యుడు, ఉపవక్తా-బ్రహ్మ, సోమః-చంద్రుడు, సోమస్య-సోమలతయొక్క, పురోగాః-ముందునడుచుచున్నాడు, శుక్రః-ప్రకాశింపజేసెడిమంత్రము, శుక్రస్య-గ్రహింపబడిన సోమరసమునకు, పురోగాః-ముందువిలసిల్లుచున్నది, ఇంద్ర-ఓయింద్రుడా, వాతాపేః-వాయువువలెనే శీఘ్రముగ వెళ్లువాడవును, హవఃశ్రుతః-పిలుపునువినునట్టివాడవునగు, తే-నీనిమిత్తము, సోమాః-సోమరసములు, శ్రితాః-పచనముచేయబడినవి లేక నిన్నునాశ్రయించియున్నవి.

తా॥ ఇకను పంచహోతృ సంబంధమగు మంత్రముచెప్పబడుచున్నది. "పశ్చాచ్చతుర్హోతారం పంచహోతారం" అని బ్రాహ్మణములో దానివిని యోగము జెప్పబడియున్నది. కాబట్టి దానిపాఠక్రమ మెట్లనగా, అగ్నిహోతృడు హోతయనియు, అశ్వినీదేవతు లధ్వర్యులనియు, త్వష్ట ఆగ్రీధుడనియు, మిత్రుడు ఉపవక్తయనియు నిట్లు పంచహోతలను జెప్పెను. అయితే యిక్కడ నలుగురినేజెప్పినప్పుడు పంచహోతృసంబంధ మెట్లనినయెడల. అశ్వినీదేవతులధ్వర్యుని ద్వివచనముగ జెప్పుటచే "అధ్వర్యుః ప్రతిప్రస్థాతా చ" అని యున్నది కాబట్టి ఆయిద్దరిలో నొకడధ్వర్యుడు ఒకడు ప్రతిప్రస్థాతయని చెప్పుటచే నయిదుగురుహోతలగుదురు కాబట్టి పంచహోతృత్వము సిద్ధించును. ఇకను గ్రహభాగమును గురించి చెప్పుచున్నాడు. యజ్ఞమునుజేయుప్రదేశమునకు సోమలతనుదెచ్చెదరు కాబట్టి దానికిముందుగా సోముడునువచ్చుచున్నాడు దేవతలను ప్రకాశింపజేసెడి మంత్రము సోమరసమునకు ముందువిలసిల్లుచుండును, అనగా ముందు మంత్రమునుచ్చరించి పిమ్మట నాయాదేవతలకు సోమరసమునిచ్చెదరు. ఓయింద్రుడా యజమానుడు యజ్ఞమునుజేయుచు నీనిమిత్తము సోమరసములను పచనముజేసి నిన్ను పిలుచుచున్నాడు కాబట్టి నీవునిన్నా యువేగముతో సమానమగునట్లు శీఘ్రముగవెళ్లి యాసోమరసమును పానముజేయుమని స్వకీయమగు వాక్కు చెప్పుచున్నది.

అథ చతుర్థోనువాకః.

శ్రుతిః ౧॥ సూర్యంతేచక్షుః। వాతంప్రాణః। ద్యాంపృష్ఠం అన్తరిక్షమాత్మా। అంగైర్యజ్ఞం। పృథివీగ్ంశరీరైః। ౧॥ ౨। వాచస్పతేఽచ్ఛిద్రయావాచా। అచ్ఛిద్రయాజుహ్వా। దివిదేవావృధగ్ం హోత్రామేరయస్వస్వాహా॥ ౨। సూర్యంతేనవ॥

అథ భాష్యమ్.

అథషడ్ఢోతృమన్త్రఉచ్యతే॥ ద్వివిధస్తన్మన్త్రః। అస్మింశ్చతు

రనువాకే ప్రోక్తస్సూర్యం తేచక్షురిత్యేకః । షష్ఠానువాకే ప్రోక్తోవా
ఘ్నోతేత్యపరః । సఏవచాతుర్హోతృ చయనేప్రయోక్తవ్యః । వాఘ్నోతా
షడ్ఢోతౄణామిత్యేవంత ద్బ్రాహ్మణేనిర్దేశాత్ । సూర్యంతేఇత్యస్యతు
పశుబంధాదావినియోగః। సచహోతృబ్రాహ్మణకాండేపఠ్యతే । పశు
బంధేనయక్ష్యమాణః షడ్ఢోతారంమనసానుద్రుత్యా హవనీయే జుహు
యాదితి। తన్మంత్రపాఠస్తు॥ ౧॥ సూర్యం తేచక్షుః—పృథివీగ్ంశరీరైః॥
ఇతి॥ ౧॥ హేపశో-యూయం సూర్యం- సూర్యః- సఏవ- తే- చక్షుః-
యోవాయుస్స తే- ప్రాణః- తథా పశువిషయే ద్విగుప్రైషేసమామ్నా
యతే - సూర్యంచక్షుర్గమయతాత్ । వాతంప్రాణమన్వవసృజతాదితి।
యాద్యాః సఃపృష్ఠభాగః ఉపరివర్తిత్వసామ్యాత్ - యదిదం అంత
రిక్షం తత్త్వద్వితీయోజీవాత్మా మధ్యవర్తిత్వసామ్యాత్ । యానిహృద
యాదీన్యంగాని-తైః- యజ్ఞం సంపాదయతీతి శేషః । యాన్యన్యాన్య
స్థ్యాదీని శరీరగతాని-తైః పృథివీం ప్రాప్నుహీతి శేషః। సూర్యం తేచక్షు
రిత్యాదావపిత్వదీయం చక్షుస్సూర్యం ప్రాప్నోత్వితి యోజనీయం।
అథవావక్ష్యమాణం వాచస్పతిసంబోధనమనూద్యతే । చక్షుస్సూర్య
రూపం జానీయాదిత్యేవం వాచస్పతి పరతయా మంత్రో యోజ్యం।
హోమనిష్పాదకస్యపశోః చక్షురాదీన్నిషడంగాన్యత్రోక్తాని । ఇత్యస్య
మంత్రస్యషడ్ఢోతృత్వం॥

అథగ్రహభాగమాహ॥ ౨॥ వాచస్పతేఽచ్ఛిద్రయా— హోత్రా
మేరయస్వస్వాహా॥ ౨॥ ఇతి॥ హే - వాచస్పతే - అచ్ఛిద్రయా-
వాచా- స్వరాక్షర సంపూర్ణేన- మంత్రేణ - అచ్ఛిద్రయా - జుహ్వా
ఘృతసంపూర్ణయా స్రుచా దేవావృధం - దేవానాం - వర్ధయిత్రీం-
హోత్రాం- హోమక్రియాం- దివి -ద్యులోకే ఏరయస్వ సర్వతః ప్రేరయ
ఏతమర్థముద్దిశ్య జుహుధీతి స్వకీయావాగాహ॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే
వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయ ప్రపాఠకే చతుర్థోనువాకః.

**టీక॥ హేపశో=ఓయాగపశువా, సూర్యం=సూర్యుడు, తే=నీయొక్క, చక్షుః=
నేత్రము, వాతం=వాయువు, తే=నీకు, ప్రాణః=ప్రాణము, ద్యాం=స్వర్గము, పృష్ఠం=**

పృష్ఠభాగము, అంతరిక్షం=ఆకాశము, ఆత్మా=రెండవజీవము, అంగైః=నీయవయవములు చేత, యజ్ఞం=యజ్ఞముచేయబడుచున్నది, శరీరైః=ఎముకలు మొదలగు శరీరములచేత, పృథివీం=భూమిని, ప్రాప్నుహి=పొందుము, వాచస్పతే=ఓవాక్పతీ, అచ్ఛిద్రయా=సంపూర్ణమగు, వాచా=వాక్కుచేతను, అచ్ఛిద్రయా=సంపూర్ణమగు, జుహ్వా=స్రుక్కుచేతను, దేవావృధం=దేవతులకు వృద్ధికరమగు, హోత్రాం=హోమక్రియను, దివి=స్వర్గలోకమందు, ఏరయస్వ=ప్రేరేరింపుము.

తా॥ ఇకను షడ్ఢోతృమంత్రము చెప్పబడుచున్నది. ఆమంత్రము రెండువిధములు. ఎట్లనగా 'సూర్యంతేచక్షుః' అని యీ శాల్గవయనువాకములో చెప్పబడినదియొకవిధము. "వాగ్ఘోతా" అనియారవ యనువాకములో జెప్పబడిది మరియొకటి. "వాగ్ఘోతాషడ్ఢోతౄణాం" అని బ్రాహ్మణములో జెప్పబడియున్నది కాబట్టి చాతుర్హోత్రచయనమునందు షడ్ఢోతృవిషయము ప్రసక్తమైనప్పుడు ఆరవయనువాకమగు 'వాగ్ఘోతా' యనునదియే నుపయోగించవలయును. "సూర్యంతేచక్షుః" అనునది పశుబంధాదులయందు నుపయోగింపవలయును. "పశుబంధేనయక్ష్యమాణః షడ్ఢోతారంమనసానుద్రుత్యాహవనీయేజుహుయాత్" అని హోతృబ్రాహ్మణభాగములో పశుబంధవిషయమై యిదిచెప్పబడియున్నది. ఓ పశువా! సూర్యుడు నీయొక్క నేత్రము. వాయువు నీప్రాణము స్వర్గలోకము పరిభాగమందుండుటచే నీకు పృష్ఠభాగమైయున్నది ఆకాశము శరీరమందంతటను వ్యాపించి యుండుటచే నీకు రెండవజీవాత్మ స్వరూపమైయున్నది నీయొక్క హృదయము మొదలగు నవయవములవలన యజ్ఞము చేయుట సంభవించుచున్నది యజ్ఞము చేయుటకు నుపయోగింపగామిగిలిన యెముకలుమొదలగు నీశరీరావయవములు భూమిలోకలియుచున్నవి. లేక "సూర్యంచక్షుర్గమయతాత్-వాతం ప్రాణమన్వవసృజతాత్" అనిబ్రాహ్మణములో జెప్పబడుట వలన ఓపశువా! నీయవయవములలో నేత్రము సూర్యునిపొందును. ప్రాణమువాయువును పొందును. నీపృష్ఠము స్వర్గమును జెందును జీవము ఆకాశమును పొందును అనియును జెప్పదగును. లేక ముందువాచస్పతియొక్క సంభోధకలుగుచున్నదిగనుక ఓవాచస్పతినీచక్షువు సూర్యరూపమును తెలిసికొనును. నీప్రాణము వాయువును తెలిసికొనును. అని ఈ ప్రకారముగానైనను వాచస్పతిపరముగ మంత్రమును అన్వయించుకొనవచ్చును. యజ్ఞములో హోమనిమిత్తము పశువుయొక్క ఆరు అవయవములను ఈ మంత్రములో జెప్పబడెను కాబట్టి యీ మంత్రమునకు షడ్ఢోతృత్వము సంభవించినది. ఇకను గ్రహభాగమును చెప్పుచున్నాడు ఓ వాచస్పతీ! స్వరాక్షరపదములు మొదలగునవి లోపములేకుండా

మంత్రములను జెప్పుచు స్రుక్కునిండా ఆజ్యమునుంచి జేయుసట్టి హోమములను స్వర్గలోకములో నంతటనుండునట్టి దేవతలకు తృప్తికరమగునట్లుగా జేయుమని తనసంబంధమగు వాక్కు చెప్పుచున్నది.

అథ పంచమోనువాకః.

౧॥ మహాహవిర్హోతా। సత్యహవిరధ్వర్యుః। అచ్యుతపాజాఅగ్నీత్-అచ్యుతమనాఉపవక్తా। అనాధృష్యశ్చా ప్రతిధృష్యశ్చ యజ్ఞస్యాభిగరౌ। అయాస్యఉద్గాతా (౧) (౨) వాచస్పతే హృద్విధేనామన్। విధేమతేనామ। విధేస్త్వమస్మాకంనామ। వాచస్పతిస్సోమమపాత్। మాదైవ్యస్తంతుశ్ఛేది మామనుష్యః। నమోదివే। నమఃపృథివ్యై స్వాహా॥ (౨) అపాత్త్రీణిచ॥

అథ భాష్యమ్.

అథ సప్తహోతృమన్త్రఉచ్యతే॥ తస్యచవినియోగశ్చాతుర్హోత్ర బ్రాహ్మణఏవమామ్నాతః। ఉపరిష్టాత్ప్రాఙ్చగ్ం సప్తహోతారమితి తత్పాఠస్తు॥ ౧॥ మహాహవిర్హోతా— అయాస్యఉద్గాతా॥ ౧। ఇతి॥ మహాహవిః- సత్యహవిః- ఇత్యాద్యాః- అయాస్యాన్తాః- సప్తసంఖ్యాకాః మహర్షయః- తన్మహర్షి స్వరూపాః - అత్రత్యాహోత్రాదయః- యజ్ఞస్యసోమయాగస్య- అభిగరౌ- అభితః- ఉద్గాతుః పురస్తాత్పశ్చాచ్చ గృహీత ప్రస్తార ప్రతిహారభాగౌ గాయేతఇతి ప్రస్తోతృప్రతిహర్తారావభిగరౌ। హోతాధ్వర్యురాగ్నీధ్రో బ్రహ్మప్రస్తోతా ప్రతిహర్తోద్గాతేతి సప్తసంఖ్యాకా హోమనిష్పాదకా ఋత్విజఇతి అయం మంత్రసప్తహోతేత్యుచ్యతే॥ అథ గృహభాగమాహ॥ ౨॥ వాచస్పతే పృథివ్యైస్వాహా॥ ౨॥ ఇతి హేవాచస్పతే। హేహృద్విధే హృదయస్య విధాతః చిత్తప్రేరకేత్యర్థః। హేనామన్- సర్వజగత్సంబంధ ప్రమాణయుక్త- తే- తుభ్యం- నామ- నమనం ప్రణతిం విధేమ కుర్మః-త్వంచ అస్మాకం- నామ- విధేః- దేవానాంమధ్యే- సమ్యక్ యష్టవానితి ప్రసిద్ధం నామధేయంకురు అయ- వాచస్పతిః సోమం- అపాత్- పీతవాన్- దైవ్యస్తంతుః - మద్గృహే- హవిస్స్వీకారార్థం- ఆగతో దేవసంబంధీ సంతానః- మాచ్ఛేది- కదాచిదపి విచ్ఛిన్నోమాభూత్। తథా- మను

ష్య స్తంతుః ఋత్విక్ప్రవాహోపి- విచ్ఛిన్నోమాభూత్ - ద్యావాపృథివీభ్యాం-నమః అస్తుత-మిమమర్థముద్దిశ్యజుహుధీతిస్వకీయావాగాహ॥౨॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే పఞ్చమోనువాకః.

టీక॥ మహావావిః=మహావావియనుముని. హోతా=హోతయగును, సత్యహావిః=సత్యహావియనుముని, అధ్వర్యుః=అధ్వర్యుడు, అచ్యుతపాజాః=అచ్యుతపాజయనుముని, ఆగ్నీత్=అగ్నీధ్రుడు, అచ్యుతమనాః = అచ్యుతమనయను మునీశ్వరుడు, ఉపవక్తా=ఉపవక్తయగును, అనాధృష్యశ్చ=అనాధృష్యుడనుమునియు, అప్రతిధృష్యశ్చ=అప్రతిధృష్యుడనుమునియు, యజ్ఞస్య=యజ్ఞమునకు, అభిగరౌ=అతటను గానముచేయువారు, అయాస్యః=అయాస్యుడనుముని ఉద్గాతా=ఉద్గాతయగును॥ ౧॥ ౨॥ హృద్విధే=హృదయమును ప్రేరేపించువాడవును, సామగ్=సమస్తప్రపంచ సంబంధముగల, హేవాచస్పతే= ఓవాక్పతీ, తే= నీకొఱకు, నమః= నమస్కారమును, విధేమ = చేయుదుము, త్వంచ=నీవును, అస్మాకం=మాయొక్క, నామ= పేరును, విధేః=ప్రసిద్ధినిజేయుము, అయం=ఈ, వాచస్పతిః=వాక్పతి, సోమం=సోమరసమును, అపాత్=పానముజేసెను, దైవ్యః=దేవతాసంబంధమైన, తంతుః=సంతతి, మాచ్ఛేది=నశింపకలుగకుండుగాక, మనుష్యః=మనుష్యులసంబంధమైన, తంతుః=సంతతియు, మాచ్ఛేది=నశింపకలుగకుండుగాక, దివే=స్వర్గముకొఱకు, నమః=నమస్కారము, పృథివ్యై=భూమికొఱకు, నమః= నమస్కారము.

తా॥ ఇప్పుడు సప్తహోతృమంత్రము జెప్పబడుచున్నది "ఉపరిష్టాత్ప్రాఞ్చగ్ం సప్తహోతారం" అని యీప్రకారము చాతుర్హోత్రబ్రాహ్మణములో దానికి వినియోగము జెప్పబడినది. దానిక్రమమెట్లనగా. మహావావియను మునీశ్వరుడు హోతయగును. సత్యహావియనుముని అధ్వర్యుడు. అచ్యుతపాజుడు అగ్నీధ్రుడు-అచ్యుతమనుడు ఉపవక్త యగును. అనాధృష్యుడు అప్రతిధృష్యుడను ఇద్దరును యజ్ఞములో ఉద్గాతకుముందు గాను పిమ్మటను ప్రస్తారప్రతిహారభాగములను గ్రహించినవారై గానముచేయుదురు. కాబట్టి ప్రస్తోతృ ప్రతిహర్తలని చెప్పబడుదురు. అయాస్యుడు ఉద్గాతయగును. ఇట్లుచెప్పుటచే-హోత-అధ్వర్యుడు-అగ్నీధ్రుడు-బ్రహ్మ-ప్రస్తోత-ప్రతిహర్త-ఉద్గాత ఇట్లుయేడుగురు మునీశ్వరులు యజ్ఞములో హోమాదిక్రియలను నెరవేర్చుటకుగాను ఈమంత్రములో జెప్పబడెను, గాన యిది సప్తహోతయని చెప్పబడును. ఇకను గ్రహభాగమునుగురించి చెప్పుచున్నాడు. మనస్సును ప్రేరేపించువాడవును సమస్తప్రపంచ సంబంధముగలవాడ

వునగు రోవాక్పతీ! నీకు నమస్కారమునుజేసెదను. ఈయజమానుఁడు యథాశాస్త్రముగ యజ్ఞమునుజేసినాడని నాపేరును దేవతలలో ప్రసిద్ధికలుగునట్లుగా వ్యాపింపజేయుము. ఈవాక్పతి నేజేయు యజ్ఞములో సోమరసపానముజేయును. దేవతలందరును నాగృహమునందు నేజేయునట్టి యజ్ఞములో హవిస్సును గ్రహించునిమిత్తమెప్పుడు నెడతెగకుండ వత్తురుగాక. నాయొక్కయజ్ఞమును చేయించుచుండెడి అధ్వర్యుఁడును బ్రహ్మమొదలగు ఋత్విక్కులును ఎల్లప్పుడు వృద్ధినొందుచు నెప్పుడునాచేయజ్ఞమును జేయించుందురుగాక. సమస్త ప్రపంచమునకు నాధారభూతములైన భూమికి స్వర్గమునకు నమస్కారమును జేసెదను. అని యీప్రకారముద్దేశించి హోమమును జేయుమని స్వకీయమగువాక్కు ప్రేరేపించుచున్నది.

## అథ షష్ఠోనువాకః.

(౧) వాగ్ఘోతా। దీక్షాపత్నీ। వాతోధ్వర్యుః। ఆపోభిగరః। మనోహవిః। తపసిజుహోమి॥ ౧॥ (౨) భూర్భువస్సువః। బ్రహ్మస్వయమ్భు। బ్రహ్మణేస్వయమ్భువేస్వాహా॥ ౨॥ వాగ్ఘోతానవ॥

## అథ భాష్యమ్.

అథ ద్వితీయషడ్ఢోతృమంత్రఉచ్యతే। తస్యచవినియోగశ్చాతుర్హోత్రబ్రాహ్మణేసమామ్నాతః॥ ఉత్తరతః ప్రాఙ్చగ్ంషడ్ఢోతారమితి॥ తత్పారస్తు। ౧॥ వాగ్ఘోతా — తపసిజుహోమి॥ ౧॥ ఇతి॥ యేయం- యజమానస్య- వాక్- సేయం- హోతృస్థానీయా- యేయం- దీక్షా- సా- పత్నీస్థానీయా- యోయం- వాతః- ప్రాణరూపః - సోఽధ్వర్యుస్థానీయః- యాః ప్రోక్షణాద్యర్థాః- ఆపః- తాః- అభిగరః- బ్రహ్మస్థానీయాః- అభితోగిరతి కర్తవ్యమనుజానాతీతి అభిగరః- బ్రహ్మే-యత్ మనః- తత్ హవిస్థానీయం- తపసి అగ్నిస్థానీయే- తస్మిన్హవిః జుహోమి- స్థాపయామి అత్రవాగాదీనాంషణ్ణాం- హోత్రాదిరూపేణ- హోమనిష్పాదకానామభిధానాత్ - షడ్ఢోతృత్వం। అథగ్రహంభాగమాహ॥ (౨) భూర్భువస్సువః—స్వయంభువేస్వాహా॥ ౨॥ ఇతి॥ యఏతేభూరాదయస్త్రయోలోకాస్తేషాం యత్కారణం స్వయంభు స్వతస్సిద్ధం పరం బ్రహ్మ - తస్మై - స్వయంభువే - పరబ్రహ్మణే - జుహుధీతి స్వకీయావాగాహ॥ ౨॥

ఇతి శ్రీమత్సాయనాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థ ప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే షష్ఠోనువాకః.

టీక: వాక్=యజమానునియొక్క వాక్కు, హోతా=హోతయగును, దీక్షా=దీక్షయే, పత్నీ=భార్య, వాతః=వాయువు, అధ్వర్యుః=అధ్వర్యుఁడు, ఆపః=జలము, అభిగరః=బ్రహ్మ, మనః=మనస్సు, హవిః=హవిస్సు, తపసి = తపస్సునందు, జుహోమి = ఉంచుచున్నాను, భూర్భువస్సువః=భూర్భువస్సు వర్లోకములేవికలవో, తేషాం=ఆలోకములకు కారణమై, స్వయంభు=స్వతస్సిద్ధుడగు, బ్రహ్మ=పరబ్రహ్మము, స్వయంభువే=అటువంటి స్వతస్సిద్ధుడగు, బ్రహ్మణే=బ్రహ్మకొఱకు, స్వాహా=ఇచ్చుచున్నాను.

తా॥ ఇప్పుడు ఆఱవదియగు షడ్ఢోతృమంత్రము చెప్పబడుచున్నది "ఉత్తరతః ప్రాఙ్మ్ఖం షడ్ఢోతారం" అనిచాతుర్హోత్ర బ్రాహ్మణమునందు దానియొక్క వినియోగము చెప్పఁబడియున్నది. అదియెట్లనగా యజమానునియొక్క మంత్రస్వరూపమైనవాక్కు లే హోతయగును. ఆయన అవలంబించిన దీక్షయే భార్యయగును. ఆయన ప్రాణరూపమగు వాయువు అధ్వర్యుడనఁబడును. ప్రోక్షించుట మొదలగు క్రియలనిమిత్తముపయోగింపబడు జలము లేబ్రహ్మయనబడును. మనస్సుహోమముజేయఁబడునట్టి ఆజ్యాదిద్రవ్యమగును, తపస్సు అనునట్టి యగ్నిహోత్రముతో హోమముజేయబడును. భూర్భువస్సువరాది పదునాలుగు లోకములకు నాదిమధ్యాంతరహితుఁడై స్వతస్సిద్ధుడగు పరబ్రహ్మయేకారణము కాబట్టి యట్టి పరబ్రహ్మనుగుఱించి హోమముజేయుమని తనవాక్కు ప్రేరేపించుచున్నది.

## అథ సప్తమోనువాకః.

(౧) బ్రాహ్మణస్పతిః హోతా। సయజ్ఞః। సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః। యజ్ఞశ్చ మేభూయాత్॥ (౧) (౨) అగ్నిర్ద్విహోతా। సభర్తా। సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః। భర్తాచమే భూయాత్ (౨) (౩) పృథివీ త్రిహోతా। సప్రతిష్ఠా। ౧॥ సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః। ప్రతిష్ఠాచ మేభూయాత్ (౩॥ (౪) అన్తరిక్షంచతుర్హోతా। సవిష్ఠాః। సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః। విష్ఠాశ్చ మేభూయాత్॥ (౪) (౫) వాయుః పఞ్చహోతా। సప్రాణః। సమేదదాతు ప్రజాం పశూన్ పుష్టిం యశః। ప్రాణశ్చ మేభూయాత్॥ ౫॥ (౨) (౬) చన్ద్రమాః షడ్ఢోతా। సఋతూన్కల్పయాతి। సమేదదాతు

భూయాత్

ప్రజాం పశూన్ పుష్టింయశః। ఋతవశ్చమేకల్పన్తాం (౬) (౭) అన్న
గ్ం సప్తహోతా। సప్రాణస్య ప్రాణః। సమేదదాతు ప్రజాంపశూన్
పుష్టింయశః। ప్రాణస్యచమేప్రాణోభూయాత్ (౭) (౮) ద్యౌరష్ట
హోతా। సోనాధృష్యః। 3। సమేదదాతుప్రజాం పశూన్ పుష్టింయశః।
అనాధృష్యశ్చభూయాసం (౮) (౯) ఆదిత్యోనవహోతా। సతేజస్వీ।
సమేదదాతు ప్రజాంపశూన్ పుష్టింయశః। తేజస్వీచభూయాసం (౯)
(౧౦) ప్రజాపతిర్దశహోతా। సఇదగ్ంసర్వం। సమేదదాతుప్రజాం
పశూన్ పుష్టింయశః। సర్వంచమేభూయాత్॥ (౧౦) ౪॥ ప్రతిష్ఠా ప్రాణ
శ్చమే భూయాత్, అనాధృష్యః, సర్వంచమేభూయాత్, బ్రాహ్మణః
యజ్ఞః- అగ్నిః- భర్తా- పృథివీ- ప్రతిష్ఠా-అంతరిక్షం-విష్ఠా- వాయుః
ప్రాణః- చంద్రమా- ఋతూన్- అన్నగ్ం - సప్రాణస్య - ప్రాణః-
ద్యౌః- అనాధృష్యః- ఆదిత్యః - సతేజస్వీ - ప్రజాపతిః - సఇదగ్ం-
సర్వంచమేభూయాత్॥ అను॥ ౭॥

## అథ భాష్యమ్.

అనంతరభావినోనువాకస్య చాతుర్మాస్యేషు కేశనివర్తనేషు తద్వ్రతాతత్సత్యమితిజపిత్వా పశ్చాజ్జపమాప సంబంధిత్వా బ్రాహ్మణ ఏకహోతేతిచ అనువాకమితితథా బ్రహ్మమేధే + ఉద్రవతోమజ్జన స్యానుమన్త్రణే వినియోగం భరద్వాజఆహ। బ్రాహ్మణఏకహోతేతి చేతి। ఏతదనువాకగతేషు దశసు పర్యాయేషు ప్రథమపర్యాయమాహ (౧) బ్రాహ్మణ భూయాత్ (౧) ఇతి। యోయం వేదవిద్బ్రాహ్మణ సోయమేకేన స్వకీయేన తపసాజుహోతి సర్వస్యజగతః ఉపకరోతీతి ఏకహోతా సఏవచ జ్యోతిష్టోమాది యజ్ఞనిష్పాదకత్వాత్ యజ్ఞస్వరూపశ్చ। సఈదృశః బ్రాహ్మణః మహ్యం ప్రజాదిచతుష్టయందదాతు తత్ప్రసాదాత్ యజ్ఞః అపిమేసర్వదాభూయాత్। అథద్వితీయపర్యాయమాహ (౨) అగ్నిర్ద్విహోతా భూయాత్ (౨) ఇతి ద్వాభ్యాం పాకహవిర్హవనాభ్యాం ఉపకరోతీతి ద్విహోతా అతఏవపోషకత్వాత్ భర్తా-అన్యత్పూర్వవద్వ్యాఖ్యేయం॥ "అథ తృతీయమాహ" (3) పృథివీత్రిహోతా— ప్రతిష్ఠాచమేభూయాత్, (3) ఇతి। త్రిభిరగ్న్య

న్నయాగ్నై రుపకరోతీతి త్రిహోతృత్వం సర్వప్రాణ్యాధారత్వేన ప్రతిష్ఠాత్వం "అథ చతుర్థమాహ" (౪) అన్తరిక్షంచతుర్హోతా—విష్ఠాశ్చమే భూయాత్, (౪) ఇతి। చతుర్భిర్వ్యావృష్ట్యాకాశస్థానైః ఉపకారాచ్చతుర్హోతృత్వం। యక్షగంధర్వాదీనాం ఆశ్రయత్వాద్వివిధంస్థితి హేతుత్వంచ॥ అథపఞ్చమమాహ॥ ౫॥ వాయుఃపంచహోతా—ప్రాణశ్చమేభూయాత్, ౫॥ ఇతి। పఞ్చభిఃప్రాణాదివృత్తిభి రుపకరోతీతి పంచహోతృత్వం। వాయోః ప్రాణరూపత్వం ప్రసిద్ధం॥ అథషష్ఠమాహ ౬॥ చన్ద్రమాః-కల్పంతాం, ౬॥ ఇతి॥ షణ్ణామృతూనాం నిష్పాదకత్వేన షడ్ఢోతృత్వం। చంద్రమాః - అపివృద్ధ్యపక్షయకరాభ్యాం శుక్ల కృష్ణ పక్ష ద్వారా ఋతూన్ కల్పయతి। అతఏవాన్యత్రామ్నాతం। ఋతునన్యో వివిధ జ్జాయతే పునరితి॥ అథ సప్తమమాహ॥ ౭॥ అన్నగ్ం సప్తహోతా—ప్రాణోభూయాత్, ౭॥ ఇతి॥ సప్తానాంశీర్షణ్యానాం ప్రాణవృత్తీనాం పోషకత్వేన సప్తహోతృత్వం। అతఏవప్రాణపోషకత్వా త్ప్రాణస్య ప్రాణ ఇత్యుచ్యతే॥ అథాష్టమమాహ॥ ౮॥ ద్యౌరష్టహోతా—అనాధృష్యశ్చభూయాసం, ౮ ఇతి। ఆరోగాదిభిః కశ్యపాన్తైరష్టభిః సూర్యై రుపకరోతీతి ~~అష్టహోతృత్వం। ద్యులోకస్యకేనాపి నిరాకర్తుమశక్యత్వా~~దనాధృష్యత్వం॥ అథనవమమాహ॥ ౯॥ ఆదిత్యో—తేజస్వీచభూయాసం, ౯ ఇతి। పూర్వోక్తైరష్టభిర్హోతృభి స్తత్రానుగతేన సామాన్యరూపేణ నవధోపకారాత్ నవహోతృత్వం। తేజస్విత్వంచాదిత్యస్య ప్రసిద్ధం॥ అథదశమమాహ॥ ౧౦॥ ప్రజాపతిః— మేభూయాత్, ౧౦ ఇతి। నవవై పురుషప్రాణానాభి ర్దశమీతి శ్రుతాని శరీరగతాని దశచ్ఛిద్రాణ్యుత్పాద్యోపకారిత్వా ద్దశహోతృత్వం। సర్వజగత్కారణత్వేన సర్వాత్మకత్వం ప్రజాపతేః ప్రసిద్ధం॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థ ప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే సప్తమోనువాకః.

## ప్రతిపదార్థం.

**టీక॥ బ్రాహ్మణః=వేదవేత్తయగు బ్రాహ్మణుడు, ఏకహోతా=ఒకహోతయగును, సః=ఆబ్రాహ్మణుడు, యజ్ఞః=యజ్ఞస్వరూపుడు. సః=ఆయన, మే=నాకొఱకు,**

ప్రజాం=సంతానమును, పశూన్=పశువులను, పుష్టిం=బలమును, యశః=కీర్తిని, దదాతు=యిచ్చుగాక, యజ్ఞశ్చ=యజ్ఞమున్నూ, మే=నాకు, భూయాత్=ఉండునుగాక, అగ్నిః=అగ్నిహోత్రుడు, ద్విహోతా = రెండుహోతల స్వరూపుడు, సః=ఆయగ్నిహోత్రుడు, భర్తా=భరించువాడు, సః=ఆయన, ప్రజాంపశూన్‌పుష్టింయశః=సంతానమును పశువులను బలమును కీర్తిని, మే=మాకొఱకు, దదాతు=ఇచ్చుగాక, మే=నాయొక్క, భర్తాచ=భరించువాడును, భూయాత్=అగుగాక ఇట్లు పదిపర్యాయములలో పైన జెప్పబడెడి, 'సమే దదాతు' అనెడు వాక్యమునకు అర్థమును జెప్పుకొనవలయును పృథివీ=భూమి, త్రిహోతా=మూడుహోతల స్వరూపమైనది, సః=ఆభూమి, ప్రతిష్ఠా=సర్వాధారమైనది, మే=నాకు, ప్రతిష్ఠాచ=ప్రతిష్ఠయు, భూయాత్=అగుగాక అన్తరిక్షం=ఆకాశము, చతుర్హోతా=నాలుగుహోతలస్వరూపము, సః=ఆయాకాశము, విష్ఠాః=ఆధారమైనది, మే=నాకు, విష్ఠాశ్చ=ఆధారమైనది, భూయాత్=అగుగాక, వాయుః=వాయువు, పంచహోతా=అయిదుహోతలస్వరూపమైనది, సః=ఆవాయువు, ప్రాణః=ప్రాణస్వరూపమైనది, మే=నాకు, ప్రాణశ్చ=ప్రాణమున్నూ, భూయాత్=అగుగాక, చంద్రమాః=చంద్రుడు, షడ్ఢోతా=ఆఱుహోతలవాడగును, సః=ఆచంద్రుడు, ఋతూన్=ఋతువులను, కల్పయాతి=కల్పించుచున్నాడు, మే=నాకు, ఋతవః=ఋతువులు, భూయాత్=సమృద్ధికలవియగుగాక, అన్నం=అన్నము, సప్తహోతా=ఏడుహోతలతో సమానమైనది, సః=ఆయన్నము, ప్రాణస్య=ప్రాణమునకు, ప్రాణః=ప్రాణము, మే=నాయొక్క, ప్రాణస్యచ=ప్రాణమునకును, ప్రాణః=ప్రాణమై, భూయాత్=అగుగాక, ద్యౌః=స్వర్గము, అష్టహోతా=ఎనిమిదిహోతలతో సమానమైనది, సః=ఆస్వర్గము, అనాధృష్యః=నిరాకరింపశక్యముకానిది, అహం=నేను, అనాధృష్యశ్చ=నిరాకరింపశక్యముకానివాడనై, భూయాసం=అగుదును, ఆదిత్యః=సూర్యుడు, నవహోతా=తొమ్మండుగురు హోతలతో సమానుడు, సః=ఆసూర్యుడు, తేజస్వీ=ప్రకాశించువాడు, అహం=నేను, తేజస్వీచ=తేజస్సుగలవాడనై, భూయాసం=అగుదును, ప్రజాపతిః=బ్రహ్మ దశహోతా=పదిహోతలతో సమానుడు, సః=ఆబ్రహ్మ, ఇదం=ఈకనబడునట్టి, సర్వం=సమస్తప్రపంచమునునిర్మించినవాడు, మే=నాకు, సర్వంచ=సమస్తము, భూయాత్=అగుగాక.

తా॥ కేశనివర్తనములగు చాతుర్మాస్యలయందు 'తద్వ్రతం తత్సత్యం' అని జపించినపిమ్మట జపించవలసిన మంత్రమును ఆపస్తంబుడు "బ్రాహ్మణఏకహోతా" అనునట్టి యనువాకమును జెప్పెను. ఆప్రకారముగానే 'బ్రాహ్మణఏకహోతా' అనియు భరద్వాజమునీశ్వరుడు బ్రహ్మమేధమునందు జెప్పెను. ఈయనువాకమునందు పదిపర్యా

యములు చెప్పబడెనవి. వానిలో మొదటిపర్యాయమగు మంత్రవిషయమెట్లనగా 1 వేద
వేదాంగవిదుడగు బ్రాహ్మణుడు తన తపస్సుతో ముఖ్యముగ ప్రవర్తించుచుండును. అట్టి
బ్రాహ్మణుడే జ్యోతిష్టోమాది యజ్ఞములుజేయుచుండును. అట్టి బ్రాహ్మణుడు సంతా
నము పశువులు బలము కీర్తి మొదలగువానిని నాకుగలిగించుగాక. అట్టి బ్రాహ్మణునియొ
నుగ్రహమువలన యెల్లప్పుడు యజ్ఞములను నేనుజేయుచుండెదను. (2) అగ్నిహోత్రుడు
హవిస్సునువండుటకును వండబడిన హవిస్సుహోమముజేయుటకు నుపయోగించువాడుగాన
యీ రెండువిధములచే ద్విహోతయని యగ్నిహోత్రుడు చెప్పబడును. అందువల్లనే జగ
త్పోషకుడగును కాబట్టి భర్తయనబడును. కాబట్టి నన్నుభరించువాడగును. (3) అగ్ని
అన్నము యజ్ఞము అనునట్టి యీమూడుసాధనములచే భూమిసర్వప్రాణాధారమై యుప
కారముజేయునది కాబట్టి త్రిహోతయనబడి సర్వప్రపంచమునకు ప్రతిష్ఠయైనది. అట్టి
భూమి నాకు సంతానాదులనిచ్చి యాధారమగుగాక. (4) "మేఘోవిద్యుత్ స్తనయిత్నుర్
వృష్టిః" అని యరుణములో జెప్పబడిన వాక్యానుసారముగ మేఘము మెరుపు గర్జి
తము వర్షము అనునట్టి చతుర్విధమగు వృష్టికి నాకాశము ఆధారమైనది కాబట్టి చతు
ర్హోతయనబడును. అట్టియాకాశము నాకు సంతానాదులనిచ్చి ఆధారమైయుండుగాక
(5) ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అని అయిదువిధములచే వాయు
వు సర్వప్రాణులకు నాధారమైనదికాబట్టి పంచహోతయనబడును. అట్టివాయువు నాకును
ప్రాణరూపమై సంతానాదులనిచ్చుగాక. (6) శుక్లపక్షము కృష్ణపక్షము అని మాసము
నకు రెండుపక్షములు అయియున్నవి. అట్టిమాసములు రెండుఅయినయెడల నొక ఋతు
వగును. అట్టిఋతువులు సంవత్సరమునకు ఆరు అయినవి. ఇట్టిఋతువులారింటికి కారణ
భూతుడు కాబట్టి చంద్రుడు షడ్ఢోతయనబడును. అట్టి చంద్రుడు నాకు సంతానాదులనొ
సంగుగాక వసంతాదిఋతువులున్నూ నాకు సర్వసమృద్ధిగానుండుగాక. (7) జంతు
వులయొక్క సప్తప్రాణులకు నన్నము పోషకమైనది కాబట్టి యన్నము ప్రాణమునకు
ప్రాణమనియు శీర్షసంబంధ సప్తప్రాణాధారకమైనది కాబట్టి సప్తహోతయనియు
జెప్పబడెను. అట్టియన్నము నాకును ప్రాణాధారకమై సంతానాదులనిచ్చి నన్నుపోషిం
చుగాక. (8) అరుణవాక్యానుసారముగ ఆరోగుడు మొదలగు కశ్యపునివరకు జెప్పబడి
యుండెడి యెనిమిది సూర్యులకు నాధారమగుటవలన స్వర్గము అష్టహోతయని చెప్పబ
డును. అట్టిస్వర్గము ఎవరిచేత నిరాకరింప శక్యముకానిది. ఆస్వర్గమునాకు సంతానాదుల
నొసంగుగాక. అట్టి దేవతాబలమువలన నేనున్నూ యెవరిచేతను నిరాకరింపబడకయుందును.
(9) పూర్వము ప్రత్యేకముగ జెప్పబడిన యెనిమిదివిధములగు సూర్యులు వీరియొక్కసమష్టి

రూపమగు సూర్యుడు. ఇట్లు సూర్యునకు నవవిధత్వము సంభవించినది కాబట్టి సూర్యుడు నవహోతయని చెప్పబడును. ప్రకాశముగలవాడు. ఆ సూర్యుడు నాకు సంతానాదులనొసంగుగాక. ఆసూర్యునివలన నేనున్నూ తేజస్సుకలవాడనగుదును. |(10) ప్రజాపతి సమస్తప్రాణులను సృష్టించి యాప్రాణులకు నాహారభక్షణాది సర్వవ్యాపారములు జరుగుటకుగాను శరీరమునకు ముఖము మొదలకు తొమ్మిది రంధ్రములను నిర్మించి నాభియను దానిని పదియవరంధ్రమునుకూడ సృజియించెను. ఇట్లు పదిరంధ్రములను నిర్మించుటు శరీరమునకు నుపకారకమైనది పదిరంధ్రముల నిర్మించి యుపకారియగుటచే ప్రజాపతిదశహోతయనియు నీప్రపంచమంతయు నాతనిస్వరూపమేయనియు చెప్పబడును. అట్టిప్రజాపతి యనుగ్రహమువలన సంతానపశువులు బలము కీర్తి సమస్తసంపత్తులు నాకు లభించుగాక.

## అథాష్టమోనువాకః.

(౧) అగ్నిర్యజుర్భిః సవితాస్తోమైః। ఇన్ద్రఉక్థామదైః। మిత్రావరుణావాశిషా। అఙ్గిరసోధిష్ణియైరగ్నిభిః। మరుతస్సదోహవిర్ధానాభ్యాం। ఆపఃప్రోక్షణీభిః। ఓషధయోబర్హిషా। అదితిర్వేద్యా। సోమోదీక్షయా॥ ౧॥ త్వష్టేధ్మేన। విష్ణుర్యజ్ఞేన। వసవఆజ్యేన। ఆదిత్యాదక్షిణాభిః- విశ్వేదేవాఊర్జా। పూషాస్వగాకారేణ। బృహస్పతిః పురోధయా ప్రజాపతిరుద్గీథేన। అన్తరిక్షం పవిత్రేణ వాయుః పాత్రైః। అహగ్గ్ శ్రద్ధయా॥ ౧॥ ౨। దీక్షయాపాత్రైరేకంచ॥

## అథ భాష్యమ్.

అథ సమ్భారయజూంషిఉచ్యన్తే॥ తేషాంచేష్టకోపధానే వినియోగశ్చాతుర్హోత్రియ బ్రాహ్మణేఽభిహితః॥హృదయంయజూగ్ంషి పత్న్యశ్చేతి। తేషామేకవింశతి సంఖ్యాకానాం యజుషాంపాఠస్తు॥ ౧॥ అగ్నిర్యజుర్భిః— అహగ్గ్ శ్రద్ధయా।(౧) ఇతి। అత్రాగ్నిసవిత్రాదయో దేవా యజుస్తోమాదీనియజ్ఞే సంవరణీయాన్యంగాని। ఏతైర్దేవాః తైః సంవరణీయైః సహాస్మిన్ కర్మణ్యాగచ్ఛంతీతి వాక్యార్థః। ఉక్థామదః- శస్త్రవాచీ। యజ్ఞశబ్దోహవిః ప్రక్షేపవాచీ- స్వగాకారః- శంయువాకమన్త్రః। పురోధా గ్రహణకాలే పఠనీయా ఋక్ పురోవాక్। పవిత్రశబ్దోదశపవిత్రవాచీ। అహం- యజమానః - శ్రద్ధయాసహాగచ్ఛామి॥ స్పష్టమన్యత్॥

శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్య ముని విరచితే వేదార్థ ప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే అష్టమోనువాకః.

## ప్రతిపదార్థం.

టీక॥ అగ్నిః=అగ్నిహోతృడు, యజుర్భిః=యజుర్వాక్యములతోను, సవితా=సూర్యుడు, స్తోమైః=యజ్ఞసంభారములతోను, ఇంద్రః=ఇంద్రుడు, ఉక్థామదైః=శస్త్రములతోను, మిత్రావరుణౌ=మిత్రావరుణులు, ఆశిషా=ఆశీర్వచనముతోను, అంగిరసః=అంగిరస్సులు, ధిష్ణ్యైః=పూర్ణమగు, అగ్నిభిః=అగ్నిహోత్రములతోను, మరుతః=దేవతలు, సదోహవిర్ధానాభ్యాం=సభయుం హోమసాధనములతోను, అపః=జలములు, ప్రోక్షణీభిః=ప్రోక్షణపాత్రలతోను, ఓషదయః=ఓషదులు, బర్హిషా=బర్హిస్సుతోను, అదితిః=దేవమాత, వేద్యా=వేదికతోటి, సోమః=చంద్రుడు, దీక్షయా=యజ్ఞదీక్షతోను, త్వష్టా=బ్రహ్మ, ఇధ్మేన=ఇధ్మములతోను, విష్ణుః=విష్ణుమూర్తి, యజ్ఞేన=హవిస్సునుంచునట్టియొకానొక సాధనముతోను, వసవః=అష్టవసువులు, ఆజ్యేన=ఆజ్యముతోను, ఆదిత్యాః=ఇతరదేవతులు, దక్షిణాభిః=దక్షిణతోను, విశ్వేదేవాః=విశ్వేదేవతలు, ఊర్జా=బలముతోను, పూషా=పూషయనుసూర్యుడు, స్వగాకారేణ = శంయువాకమంత్రముతోను, బృహస్పతిః=బృహస్పతి, పురోడయా=పురోహితధర్మముతోను, ప్రజాపతిః=బ్రహ్మ, ఉద్గీథేన=సామవేదముతోను, అంతరిక్షం=ఆకాశము, పవిత్రేణ=పవిత్రములతోను, వాయుః=వాయువు, పాత్రైః=పాత్రలతోను, అహం=నేను, శ్రద్ధయా=శ్రద్ధతోను, ఆగచ్ఛామః=వచ్చుచున్నాము.

తా॥ ఇక్కడ యజ్ఞసంబంధమైన సంభారములు చెప్పబడుచున్నవి 'హృదయం యజూగ్ంషిపత్న్యశ్చేతి' అని చాతుర్హోత్రియబ్రాహ్మణములో ఈసంభారములయొక్క వినియోగముచెప్పబడినది. అట్టియుద్దవైయొక్క సంభారములెవ్వియనగా, అగ్నిహోత్రుడు యజుర్వేదమును, సవితయనుసూర్యుడు స్తోత్రవాక్యలను, ఇంద్రుడుశస్త్రములను, మిత్రావరుణులు ఆశీర్వచనములను, అగిరస్సులు సంపూర్ణమగు త్రేతాగ్నులను, సప్తవాయువులు సదస్సును హవిస్సునుంచుకొనదగిన వస్తువులను, జలములు ప్రోక్షణచేయుపాత్రలను, వృక్షాదిలతలు యజ్ఞమునకు నుపయోగింపబడు దర్భలను, అదితియను దేవమాత అగ్నిహోత్రమునుంచునట్టి స్థానమగు వేదికను, చంద్రుడు యజ్ఞమునకు తగిన దీక్షను, త్వష్టయను బ్రహ్మ ఇధ్మములను, విష్ణుమూర్తి హవిస్సునుంచునట్టి స్రువాదులను అష్టవసువులు ఆజ్యమును, యితరదేవతులు యజ్ఞదక్షిణలను, విశ్వేదేవతులుబలమును, పూషయను సూర్యుడు

కంయువాకమంత్రములను, బృహస్పతి యజ్ఞమునకు సాధ్వర్యమునహించి చేయించుట యును, ప్రజాపతి సామవేదసంభారమును, ఆకాశము దశపవిత్రములను, వాయువుయజ్ఞము నకు కావలసిన యితరపాత్రలను, ఇట్లు సమస్తదేవతులు యజ్ఞమునకుకావలసిన సమస్తసం భారములనొసంగి నన్ను శ్రద్ధగలవానిగాజేసి నాచేయజ్ఞమును జేయించెదరుగాక.

## అథ నవమోనువాకః.

(౧) సేనేంద్రస్య। ధేనాబృహస్పతేః। పథ్యాపూష్ణః। వాగ్వాయోః। దీక్షాసోమస్య। పృథివ్యగ్నేః। వసూనాంగాయత్రీ। రుద్రాణాం త్రిష్టుప్। ఆదిత్యానాంజగతీ। విష్ణోరనుష్టుప్। వరుణస్యవిరాట్। యజ్ఞస్య పఙ్క్తిః। ప్రజాపతేరనుమతిః। మిత్రస్యశ్రద్ధా। సవితుః ప్రసూతిః। సూర్యస్యమరీచిః। చన్ద్రమసోరోహిణీ। ఋషీణామరుంధతీ। పర్జన్యస్య విద్యుత్। చతస్రోదిశః। చతస్రోఽవాంతరదిశాః। అహశ్చరాత్రిశ్చ। కృషిశ్చవృష్టిశ్చ। త్విషిశ్చాపచితిశ్చ। ఆపశ్చౌషధయశ్చ। ఊర్క్చసూనృతాచ దేవానాంపత్నయః॥ అనుష్టుప్దిశష్షట్చ॥

## అథ భాష్యమ్.

అథదేవపత్న్యాఖ్యా మంత్రాఉచ్యంతే। తేషాంచవినియోగః పూర్వవద్ద్రష్టవ్యః। పత్న్యశ్చేత్యేవం తత్రతత్పత్నీష్టకానామభిధానాత్॥ పాఠస్తు॥ ౧॥ సేనేంద్రస్య—దేవానాం పత్నయః॥ ౧॥ ఇతి। దేవతాః ఇంద్రాదయః। తత్పత్న్యః- సేనాదయః। పత్న్యః। దిగ్వదిగాదయోపి కేషాంచి ద్దేవానాంపత్న్యః। ఏతాస్సర్వాః ఆగత్య - యజ్ఞమవికలం కుర్వం త్వితివాక్యార్థః। తత్రామ్నాతైః షడ్వింశతివాక్యైః షడ్వింశతి సంఖ్యాకాః పత్నీష్టకాఉపదధ్యాత్॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థప్రకాశకే యజురారణ్యకే తృతీయప్రపాఠకే నవమోనువాకః.

## ప్రతిపదార్థం.

టీక॥ ఇంద్రస్య= ఇంద్రునకు, సేనా= సేనయనునది, బృహస్పతేః = బృహస్పతికి, ధేనా=ధేన, పూష్ణః=పూషయను సూర్యునకు, పథ్యా=పథ్య, వాయోః= వాయువునకు, వాక్= వాక్కు, సోమస్య= చంద్రునకు, దీక్షా= దీక్ష, అగ్నేః = అగ్నిహోత్రు

నకు, పృథివీ= పృథివి, వసూనాం= వసువులకు, గాయత్రీ = గాయత్రి, రుద్రాణాం= రుద్రులకు, త్రిష్టుప్= త్రిష్టుప్పు, ఆదిత్యానాం= దేవతులకు, జగతీ=జగతి, విష్ణోః= విష్ణువునకు, అనుష్టుప్= అనుష్టుప్పు, వరుణస్య= వరుణదేవునకు, విరాట్= విరాట్టు, యజ్ఞస్య= యజ్ఞమునకు, పంక్తిః= పంక్తి, ప్రజాపతేః = బ్రహ్మకు, అనుమతిః = అనుమతి, మిత్రస్య= మిత్రుడను సూర్యునకు, శ్రద్ధా = శ్రద్ధ, సవితుః = సవితయను సూర్యునకు, ప్రసూతిః= ప్రసూతి, సూర్యస్య= సూర్యునకు, మరీచిః = మరీచియనునది, చంద్రమసః= చంద్రునకు, రోహిణీ= రోహిణి, ఋషీణాం= మునీశ్వరులకు, అరుంధతీ = అరుంధతి, పర్జన్యస్య- మేఘునకు, విద్యుత్= మెరుపు, చతస్రః = నాలుగైన, దిశః = దిక్కులు, చతస్రః= నాలుగైన, అవాంతరదిశాః= విదిక్కులు, అహశ్చ= పగలు, రాత్రిశ్చ=రాత్రి, కృషిశ్చ= వ్యవసాయము, వృష్టిశ్చ = వర్షము, త్విషిశ్చ = కాంతి, అపచితిశ్చ = పూజ, ఆపశ్చ= జలములు, ఓషధయశ్చ= ఓషధులు, ఊర్క్చ= బలము, సూనృతాచ = సూనృతము, దేవానాం= దేవతులకు, పత్నయః= భార్యలు.

తా॥ ఇప్పుడు దేవతులయొక్క భార్యల సంబంధమగు మంత్రములు చెప్పఁబడుచున్నవి. 'హృదయంజాగ్ంషిపత్న్యశ్చ' అని దేవతులయొక్క భార్యలనుగురించికూడ చెప్పబడియున్నది కాఁబట్టి దానియొక్క వినియోగము పూర్వమువలెనే చాతుర్హోత్రియ బ్రాహ్మణమునందు జెప్పఁబడినది. అదియెట్లనగా ఇంద్రునకు సేనయు, బృహస్పతికి ధేనయు, పూషణుడనెడి సూర్యునకు పథ్యయు, వాయువునకువాక్కు, చంద్రునకుదీక్షయు, అగ్నికి పృథివియు, వసువులకుగాయత్రియు, రుద్రులకు త్రిష్టుప్పు, ఆదిత్యులకుజగతీఛందస్సు, విష్ణువునకు అనుష్టుప్ఛందస్సు, వరుణునకు విరాట్ఛందస్సు యజ్ఞమునకు పంక్తిఛందస్సు, ప్రజాపతికి అనుమతిఛందస్సు మిత్రుడనెడి సూర్యునకు శ్రద్ధయు, సవిత సూర్యునకు ప్రసూతియు, సూర్యునకు మరీచియు, చంద్రునకు రోహిణియు, మునీశ్వరుల భార్యలలో నరుంధతియు, మేఘునకు మెరుపు, మరియు తూర్పుమొదలగు నాలుగుదిక్కులును, ఆగ్నేయము మొదలగు నాలుగుదిక్కులును, పగలు, రాత్రియు, కృషి, వర్షము, కాంతి, అపచితి, జలములు, ఓషధులు, ఊర్జము, సూనృతము, అని యీప్రకారము ఆయా దేవతులకు ఆయానామములుకల భార్యలు చెప్పబడినవి. పృథివిమొదలగు అనుమతిపర్యంతము ఛందస్సు సంబంధమగు భార్యలుగా చెప్పబడినవి. దిక్కులువిదిక్కులు మరికొందరు దేవతులకు భార్యలుగా జెప్పబడినవి. ఇట్లుయింద్రాదులు దేవతులు గాను సేనధేన మొదలగు వారు వారిభార్యలు గాను చెప్పబడినవి. ఇట్లుచెప్పబడిన ఇంద్రుడు మొదలగు దేవతులు

వారిభార్యారూపులగు సేనాములతోఁగూడ కూడినవారై జేజేయునట్టి యజ్ఞప్రదేశమునకు వచ్చి వాయజ్ఞముకు ఏవిఘ్నములేకుండా సంపూర్తియగునట్లు జేయుగాకయని యజమానుడు కోరుచున్నాడు.

అథ దశమోనువాకః.

(౧) దేవస్యత్వాసవితుఃప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం। పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి। రాజాత్వావరుణోనయతుదేవి దక్షిణేగ్నయే హిరణ్యాం తేనామృతత్వమస్యాం వయోదాత్రే। మయోమహ్యమస్తు ప్రతిగృహీత్రే। కఇదంకస్మాఅదాత్। కామఃకామాయ। కామోదాతా॥ ౧॥ కామఃప్రతిగ్రహీతా। కామగ్ంసముద్రమావిశ। కామేనత్వాప్రతిగృహ్ణామి। కామైతత్తే। ఏషాతేకామదక్షిణా। ఉత్తానస్త్వాఙ్గీరసః ప్రతిగృహ్ణామి। సోమాయవాసః। రుద్రాయగాం। వరుణాయాశ్వం। ప్రజాపతయేపురుషం॥ ౨॥ మనవేతల్పం। త్వష్ట్రేజాం। పూష్ణేవిం। నిఋర్త్యా అశ్వతరగర్దభౌ। హిమవతోహస్తినం। గన్ధర్వాప్సరాభ్యస్స్రగలంకరణే। విశ్వేభ్యో దేవేభ్యోధాన్యం। వాచేన్నం। బ్రహ్మణఓదనం। సముద్రాయాపః॥ ౩॥ ఉత్తానాయాఙ్గీరసాయానః। వైశ్వానరాయరథం। వైశ్వానరః ప్రత్నథానాకమారుహాత్। దివఃపృష్ఠం భన్దమానస్సుమన్మభిః। సపూర్వవజ్జనయజ్జన్తవేధనమ్। సమానమజ్మాపరియాతిజాగృవిః॥ ౨॥ ౩॥ రాజాత్వావరుణోనయతుదేవి దక్షిణేవైశ్వానరాయ రథం తేనామృతత్వమశ్యాం। వయోదాత్రే। మయోమహ్యమస్తు ప్రతిగ్రహీత్రే॥ కఇదంకస్మాఆదాత్। కామఃకామాయ। కామోదాతా। కామఃప్రతిగ్రహీతా। కామగ్ంసముద్రమావిశ। కామేనత్వాప్రతిగృహ్ణామి। కామైతత్తే। ఏషాతేకామదక్షిణా। ఉత్తానస్త్వాఙ్గీరసః ప్రతిగృహ్ణాతు॥ ౩॥ ౪॥ దాతా పురుష మాపః ప్రతిగ్రహీత్రే నవచ॥ ౧౦॥

అథ భాష్యమ్.

అథ ప్రతిగ్రహమంత్రాఉచ్యంతే। తైశ్చప్రతిగ్రహైరిష్టకోపధానం చాతుర్హోత్రీయ బ్రాహ్మణఏవమామ్నాతం। యథావకాశంప్రతిగ్రహేలోకం పృణాంశ్చేతి॥ తత్రప్రథమమాహ॥౧॥ దేవస్య—వైశ్వా

సరాయరథం॥ (౧) ఇతి॥ హేప్రతిగృహ్యమాణద్రవ్య సవితుః దేవస్య-
ప్రేరణేసతి అశ్వసంబంధిభ్యాం- భాహుభ్యాం - బాహుదండాభ్యాం-
పూషసంబంధిభ్యాం- హస్తాభ్యాం- త్వాం- ప్రతిగృహ్ణామి- హేదక్షిణే-
దేవి- వరుణో- రాజా- హిరణ్యరూపాం- త్వాం-అగ్నయే- నయతు-
ప్రాపయతు- తేన- అగ్నిప్రాపణేన- ప్రతిగ్రహదోషాభావాత్ -అహం
అమృతత్వం- నరకాభావరూపం- అశ్యాం- ప్రాప్నుయాం- ఇయంచ
దక్షిణా- దాత్రే- వయః- అస్తు- పక్షిరూపిణీ భూత్వా - దాతారం
స్వర్గేనయత్విత్యర్థః- ప్రతిగ్రహీత్రే- మహ్యాం- మయః- సుఖం- అస్తు।
ఇదం- ద్రవ్యం- ప్రజాపతిః - ప్రజాపతయేదత్తవాన్ । అంతర్యామి
రూపేణ దాతృప్రతిగ్రహీత్రోః- ప్రేరకత్వాత్। తథాకామః-కామా
య- దత్తవాన్। యథాప్రజాపతిః - అదృష్టప్రేరకః - తథాకామస్య
దృష్ట ప్రేరకత్వాత్- తస్మాత్ - కామః- ఏవ- దాతా- ప్రతిగ్రహీ
తాచ। స్వర్గాదిఫలవిషయః - కామోదాతా - ఐహికసుఖ విషయః।
కామః- ప్రతిగ్రహీతా। తతో- హేదక్షిణే- సముద్రసమం- కామం-
ప్రవిశ। కామేననిమిత్తేన- త్వాం- ప్రతిగృహ్ణామి। హేమద్ధృదయవర్తి-
కామ- తత్ - ఏతత్ - ద్రవ్యం- తుభ్యం - భవతి। హేకామ- తే-
త్వత్ప్రీతయే- ఏవ- ఏషా- దక్షిణా- ప్రవృత్తా। అంగిరోగోత్రే సము
త్పన్నః- ఉత్తానాఖ్యః మహర్షిః- త్వాం- ప్రతిగృహ్ణాతు। అథవస్త్రాది
ద్రవ్య విషయాన్- షోడశమంత్రాన్నాహ। ఏతేషుసర్వేషు మంత్రేషు
దేవి దక్షిణ ఇత్యంతః- పూర్వానుషంగః। తేనామృతత్వాదిక మిత్యు
త్తరానుషంగః। తస్యరథప్రతిగ్రహమంత్రస్య- శేషభూతాముత్తరాను
షంగాత్ - పూర్వభావినీం కాంచిదృచమాహ॥ ౨॥ వైశ్వానరః—పరి
యాతిజాగృవిః। (౨) ఇతి। వైశ్వానరాఖ్యోదేవః- ప్రత్నథా - పురా
తన శరీరధారీసన్- స్వర్గమారూఢవాన్ । సచ- దివఃపృష్ఠం - ద్యులోక
స్య- ఉపరిభాగం- సుమన్మభిః- మననవిశేషైః- భందమానః- కల్యా
ణం కుర్వన్వర్తతే। అయం యజమానః- ఇమాందక్షిణాం- దత్తవాన్।
ఇత్యేవం- వదన్- దేవానామగ్రే- స్మారయతీత్యర్థః। సః- వైశ్వానరః
జంతవే- ప్రాణిరూపాయ- యజమానాయ- ధనం- పూర్వవత్ - జన

యత్ - యజమానః- పూర్వం యథాదక్షిణాం- దత్తవాన్-తద్దైవ- తదనురూపం- ఫలం- జనయతి సః- వైశ్వానరః- జాగృవిః - సావధానస్సన్- ఆజ్మస్వర్గగమనశీలః- సమానం- పరియాతి । యావద్దక్షిణార్థం- ద్రవ్యం- తేనసదృశం- తద్యోగ్యం - ఫలం - పరిప్రాపయతి॥ అస్యాఋచఉపరితనం రథప్రతిగ్రహమంత్రశేషమాహ॥ (3) రాజా త్వా— ప్రతిగృహ్ణాతు" 3॥ ఇతి అత్ర తేనామృతత్వమశ్యామిత్యాది ఉత్తరానుషంగస్య సర్వత్రసాధారణ ఇతిదర్శయితుం ప్రథమమంత్రే పఠితోఽపి పునరామ్నాతః। రాజాత్వా- ఇత్యాదిః । వైశ్వానరాయరథమిత్యంతః పూర్వోక్తాయాః ఋచః-ఉపరిరథమంత్రే- పునఃపఠనీయః॥ ఇత్యేతావాన్విశేషః। ఏతైర్మంత్రైః ప్రతిగ్రహేష్టకా ఉపదధ్యాత్॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే దశమోనువాకః.

## ప్రతిపదార్థం.

టీక॥ హేద్రవ్య = ఓద్రవ్యమా, దేవస్య=దేవుఁడగు, సవితుః=సూర్యునియొక్క, ప్రసవే=ప్రేరేపణకలుగుచుండగా, త్వాం=నిన్ను, అశ్వినోః=అశ్వినీదేవతులయొక్క, బాహుభ్యాం=బాహువులచేతను, పూష్ణః=పూషణుఁడను సూర్యునియొక్క, హస్తాభ్యాం=హస్తములచేతను, ప్రతిగృహ్ణామి=గ్రహించుచున్నాను, దక్షిణే= దక్షిణస్వరూపమగు, దేవి=ఓదేవీ, వరుణః=వరుణుఁడను, రాజా=రాజు, హిరణ్యం=బంగారురూపమగు, త్వాం=నిన్ను, అగ్నయే=అగ్నిహోత్రునికొఱకు, నయతు=పొందించుగాక, తేః=ఆకారణముచేత, అమృతత్వం=అమృతస్వరూపమును, అశ్యాం=పొందెదను, దాత్రే = ఇచ్చువానికొఱకు, వయః=పక్షిరూపము, అస్తు=అగుగాక, ప్రతిగ్రహీత్రే = గ్రహించినట్టి, మహ్యం=నాకొఱకు, మయః=సుఖము, అస్తు=అగుగాక, ఇదం=ఈద్రవ్యమును, కః=ఎవఁడు, కస్మై=ఎవనికొఱకు, అదాత్=ఇచ్చెను, కామః = కామము, కామాయ=కామముకొఱకు అదాత్= ఇచ్చెను, కామః=కామమే, దాతా=ఇచ్చువాఁడు, కామః=కామము, ప్రతిగ్రహీతా=గ్రహించువాఁడు, సముద్రం=సముద్రముతో సమానమగు, కామం=కామమును, ఆవిశ=ప్రవేశించుము, కామేన=కోరికచేతనే, త్వాం=నిన్ను, ప్రతిగృహ్ణామి=గ్రహించుచున్నాను, హేకామ=ఓకామమా, ఏతత్=ఈద్రవ్యము, తే=నీకొఱకు, కామ=ఓకామమా, ఏషా=

టీ. దక్షిణా=దక్షిణగానివ్వబడినద్రవ్యము తే=నీకొఱకు, అంగీరసః = అంగీరసవంశము నందుజనియించిన, ఉత్తానస్తు=ఉత్తానుడనుమహర్షి, త్వా=నిన్ను, ప్రతిగృహ్ణాతు=గ్రహించుగాక, సోమాయ = చంద్రునికొఱకు, వాసః=వస్త్రము, రుద్రాయ = రుద్రునికొఱకు, గాః=ధేనువును, వరుణాయ=వరుణునికొఱకు, అశ్వం=గుఱ్ఱమును, ప్రజాపతయే = ప్రజాపతికొఱకు, పురుషం=పురుషుని, మనవే=మనువుకొఱకు, తల్పం=శయ్యను, త్వష్ట్రే=త్వష్టయనుబ్రహ్మకొఱకు, అజాం=మేకను, పూష్ణః=పూషనుడనుసూర్యునకు, అవిం=గొఱ్ఱెను నిఋర్త్యాః=నైర్ ఋతికి, అశ్వతరగర్దభౌ=కంచరగాడిద గాడిదలను, హిమవతః=హిమవంతునకు, హస్తినం=ఏనుగను, గంధర్వాప్సరాభ్యః=గంధర్వులకొఱకు అప్సరసలకొరకు, స్రగలంకరణే=పుష్పమాలికలు ఆభరములును, విశ్వేభ్యోదేవేభ్యః = విశ్వేదేవతులకొరకు, ధాన్యం=ధాన్యమును, వాచే=సరస్వతికొరకు, అన్నం=అన్నమును, బ్రహ్మణే=బ్రహ్మకొరకు, ఓదనం=పిష్టాదిరూపకమగునన్నమును, సముద్రాయ= సముద్రునికొరకు అపః=జలములను, అంగీరసాయ=అంగీరసవంశమునందుబుట్టిన, ఉత్తానాయ=ఉత్తానుడను మునీశ్వరునకు అనః=వాహనమును, వైశ్వానరాయ=అగ్నిహోత్రునికొరకు, రథం=రథమును, దద్యాత్= ఇవ్వవలయును, వైశ్వానరః=వైశ్వానరుడు, ప్రత్నథా=పురాతనమగు శరీరమును ధరించినవాడగుచు, నాకం=స్వర్గమును, ఆరుహత్=ఎక్కెను, సః=ఆవైశ్వానరుడు, దివః=స్వర్గముయొక్క, పృష్ఠం=ఉపరిభాగమును, సుమనస్భిః=ధ్యావవిశేషములచేత, భందమానః= శుభములనుజేయుచు, వర్తతే=ఉండును, సః=ఆవైశ్వానరుడు, జంతవే=యజమానునికొరకు ధనం=ఫలరూపమగుధనమును, పూర్వవత్=పూర్వమువలెనే, జనయత్ = కలిగించుగాక, అజ్మ=స్వర్గలోకమునకువెళ్లునట్టి, సః=ఆవైశ్వానరుడు, జాగృవిః=జాగ్రతకలవాడగుచు, సమానం=ఇచ్చినట్టిదానమునకుసమానమగుఫలమును, పరియాతి = పొందించుచున్నాడు, వరుణః=వరుణుడైన, రాజా=రాజు, దేవిదక్షిణే=ఓదక్షిణస్వరూపమగు నోదేవీ, త్వాం= నిన్ను, వైశ్వానరాయ=వైశ్వానరునికొరకు, రథం=రథమును బెందునట్లుగా, నయతు=పొందించుగాక, "తేనామృతత్వశ్యాం" అనునదిమొదలు "ఉత్తానస్త్వాంగీరసః ప్రతిగృహ్ణాతు" అనునట్టి చివరమందువాక్యమువరకు వాక్యములకునర్థమువైన వ్రాయబడినదిగాన యిచ్చట తిరిగి వ్రాయబడలేదు.

తా॥ ఇప్పుడు ప్రతిగ్రహమంత్రములను గురించిచెప్పబడుచున్నది. "యథావకాశంప్రతిగ్రహోలోకంప్రణాంశ్చ" అనిచాతుర్హోత్రియ బ్రాహ్మణమునందు ప్రతిగ్రహేష్టకోపధానమయమై చెప్పఁబడియున్నది. కాఁబట్టి దానిమయమై చెప్పఁబడుచు

న్నది. ఏదైనను దానమిచ్చినప్పుడు దక్షిణనుకూడ నిచ్చెదరు ఎందువల్లననగా ఆయాదేవతలగురించి యివ్వబడిన దానమును దక్షిణారూపమగు దేవత ఆయాదేవతలకు జెందింపజేయును కాబట్టి దానమిచ్చినప్పుడు దక్షిణనుకూడ నివ్వవలయును దానము దక్షిణనిచ్చునప్పుడు నుదకపూర్వకముగ నివ్వవలయును. ఇట్లు దానమిచ్చునపుడు దానమును పుచ్చుకొనువాడు చెప్పునదేమనగా- ఓద్రవ్యమా! సూర్యునియొక్క ప్రేరేపణవలన అశ్వనీదేవతలయొక్క బాహువులవంటి బాహువులు గలవాడనై పూషుడను సూర్యునియొక్క హస్తములవంటి హస్తములతో నిన్ను తీసుకొనుచున్నాను. ఓదక్షిణారూపమగు దేవీహిరణ్యస్వరూపమగు నిన్ను అగ్నిహోత్రునిజెందునట్లుగా వరుణదేవుడు ప్రేరేపించుచున్నాడు. అగ్నిహోత్రుడెప్పుడు పరిశుద్ధుడగుటచే నగ్నిహోత్రునితో జేరినదానవగుటవలన దానమును దక్షిణనుపుచ్చుకొనుటవలన నాకు నేవిధమైనపాపమును సంభవింపక నమృతస్వరూపమై దేవత్వమును జెందెదను. ఈదక్షిణ పక్షిరూపమువంటి స్వరూపముకలదై ప్రతిప్రదేశమునకు వెళ్లతగిన శక్తికలదియగుచు దానమిచ్చిన యజమానుని స్వర్గలోకమును జెందింపజేయును. ఈదానమును పుచ్చుకొనుటవలన నాకుసుఖముకలుగుగాక. అయితేయీదానమును యిచ్చువారెవరు. పుచ్చుకొనువారెవరు అని ప్రశ్న జేయగా యిచ్చువానియొక్కయు పుచ్చుకొనువానియొక్కయు హృదయమందు నంతర్యామిస్వరూపముగానుండి ప్రజాపతియొక్కడే యుభయులను ప్రేరేపించును కాబట్టి యిచ్చువాడును పుచ్చుకొనువాడును నొక్కప్రజాపతియేయగును, అంతయు ప్రజాపతిస్వరూపమే కాబట్టి యోదక్షిణాదేవీ సముద్రమువలెనే యనంతమగు కామమును ప్రవేశించియుండుము కామముచేతనే నిన్ను గ్రహించుచున్నాను. ఓకామమా దక్షిణాదేవి నిన్నుప్రవేశించినదికాబట్టి యీదక్షిణ నీకేజెందియున్నది. ఓకామమా నేనుపుచ్చుకొన్నట్టి ద్రవ్యమునీకేజెందుగాక. ద్రవ్యమును దానమిచ్చువాడు దానమిచ్చినందున పరలోకలాభమునుకోరి యిచ్చును. దానముపుచ్చుకొనినవాడు ఇహలోకములో సుఖములననుభవింపవచ్చునని గ్రహించును. కాబట్టి కామము దాతృప్రతిగ్రహీతలనుగురించిన ప్రేరేపణను సమముగా చేయుచుండును. అంగీరసవంశమునందు జనియించిన యుత్తానుడను మునీశ్వరుడు నిన్నుగ్రహించుచున్నాడు, ఏయేదానములేయేదేవతలకు తృప్తికరమో వానినిగురించి పదియారువాక్యములతో జెప్పుచున్నాడు. చంద్రునకు వస్త్రము, రుద్రునకుగోవు, వరుణునకు గుఱ్ఱము, ప్రజాపతికి పురుషుడు, మనువునకు శయ్య, త్వష్టప్రజాపతికి మేక, పూషణుడను సూర్యునకు గొఱ్ఱె, నిర్ఋతికి కంచరగాడిదె గాడిదె, హిమవంతునకు నేనుగు, గంధర్వులకు నప్సరసులకు మాలికలు హారములు

ఆభరణములు మొదలగునవి, విశ్వేదేవతులకు ధాన్యము, సరస్వతికి నన్నము, బ్రహ్మకు పిష్టాదిరూపమగు నన్నము, సముద్రమునకు జలములు, అంగీరసవంశజాతుడగు నుత్తానమునీశ్వరునకు వాహనము, వైశ్వానరునకు రథము, ప్రీతికరములు కాబట్టి ఆయా దేవతులను గురించి యాయాదానముల నివ్వవలయును ప్రజాపతికి పురుషవిషయకదానముగా చెప్పబడినది. యిక్కడ పురుషుడనగా పురుషుని గురించిగాని స్త్రీని గురించిగాని చెప్పుకొనవలయును అదియెట్లనగా స్త్రీ విషయము కన్యాదానముచేయుట. అందువల్ల నేక కన్యాదానముచేసినపిమ్మట 'దేవస్యత్వా' అను మంత్రమును జెప్పుచు చివరకు 'ప్రజాపతయే కన్యాం' అనిచెప్పుదురు. ఇకను పురుషవిషయ మెద్దియనగా పుత్రులులేనివానికి తనకుమారుని దత్తతచేయుట. కాబట్టి యీ రెండును ప్రజాపతికి ప్రీతికరము లేయగును. ఇకను రథప్రతిగ్రహమంత్రమును జెప్పుచున్నాడు ఆవైశ్వానరుడు పురాతనమగు దివ్యతేజోధారియగుచు స్వర్గలోకమునకు వెళ్లి ఆస్వర్గమునకు పైభాగమునుండునట్టి సత్యాదిలోకములలో సంచరించుచు ధ్యానవిశేషములచే నచ్చటశుభములు కలుగునట్లుగా ప్రవర్తించుచుండును. మఱియు ఈయజమానుడు ఈయజ్ఞమునుజేసి యింతదక్షిణ నిచ్చెదనని దేవతులయెదుట యజమానునియొక్క కీర్తిని పొగడుచు యజమానుడెంతెంత దక్షిణనిచ్చెనో దానికి తగినట్టి స్వర్గలోకాదిఫలమును కలిగింపజేయుచుండును. ఇట్లు వైశ్వానరుడు స్వర్గలోకమునకువెళ్లి యచ్చట సావధానచిత్తుడై యజమానుడు యెంతదక్షిణనొసంగెనో దానికి తగినట్లు ఫలమును పొందింపజేయుచుండును. ఇట్లుదానములను పుచ్చుకొనినను వరుణదేవుడు ద్రవ్యమును దక్షిణను అగ్నిహోత్రునకు జెందింపజేయుటచే ప్రతిగ్రహీతపుచ్చుకొనినందున నేమియు దోషములేక నచ్యుతస్వరూపమునొంది నరలోకప్రాప్తిలేకయుండును. ఇట్లు సర్వసాధారణముగా నన్నిదానములను గురించియు చెప్పబడెను. ఈమంత్రములు ప్రతిగ్రహీతకల నుపధానముజేయుటనుగురించి చెప్పబడినవి.

(1) దేవస్యత్వా—వైశ్వానరాయరథం, అనుపర్యంతము ప్రతిగ్రహమంత్రములు (2) వైశ్వానరః ప్రత్నథా—పరియాతిజాగృవిః (3) ఇంతపర్యంతము రథప్రతిగ్రహమంత్రమునకు శేషముగానున్నట్టియు నుత్తరగ్రంథ సందర్భమువలను పూర్వపదియగునో కానొక ఋక్కుగా చెప్పబడినది (4) 'రాజాత్వా—ప్రతిగృహ్ణాతు' ఇంతపర్యంతము వెనుకజెప్పబడిన ఋక్కునకు తర్వాత రథప్రతిగ్రహమంత్రశేషముగా జెప్పబడినది.

అథ ఏకాదశోనువాకః.

(౧) సువర్ణం ఘర్మంపరివేద వేనం। ఇంద్రస్యాత్మానం దశధా

చరన్తం। అన్తస్సముద్రే మనసా చరన్తం । బ్రహ్మాన్వవిన్దద్దశహోతారమర్ణే। అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం। ఏకస్సన్ బహుధా విచారః । శతగ్ం శుక్రాణి యత్రైకం భవన్తి। సర్వే వేదా యత్రైకం భవన్తి। సర్వే హోతారో యత్రైకం భవన్తి। సమానసీన ఆత్మా జనానాం॥౧॥ అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా। సర్వాః ప్రజా యత్రైకం భవన్తి। చతుర్హోతారో యత్ర సంపదం గచ్ఛన్తి దేవైః । సమానసీన ఆత్మా జనానాం॥ ౧॥

## అథ భాష్యమ్.

అథ హోతృహృదయాఖ్యా మన్త్రా అభిధీయన్తే॥ తేషాం త్విష్టకోపధానే వినియోగ శ్చాతుర్హోత్రీయ మన్త్ర బ్రాహ్మణ ఏవ సమామ్నాయతే॥ హృదయాయ యజూగ్ంషి పత్న్యశ్చేతి । తత్ర దశహోతృ హృదయాఖ్యం మన్త్రమాహ॥ (౧) సువర్ణం ఘర్మం పరివేద వేనం—— సమానసీన ఆత్మా జనానాం (౧) ఇతి॥ చిత్తి స్స్రుగిత్యాదీనాం, హోతృ మన్త్రాణాం- హృదయం- రహస్యం- తత్త్వం- పరమాత్మస్వరూపం- ప్రతిపాదయతీత్యయమనువాకో హృదయమిత్యుచ్యతే । తతోऽనేన మన్త్రేణ దశహోతృహృదయం పరమాత్మతత్త్వముచ్యతే । అహం- మన్త్రద్రష్టా- ఇన్ద్రస్య- పరమేశ్వరస్య- ఆత్మానం- నిజస్వరూపం- పరివేద- పరితః సర్వత్రావస్థితం- జానామి- కీదృశమాత్మానం- సువర్ణం- సువర్ణసదృశం- యథా సువర్ణం- స్వత ఏవ ప్రకాశమానం- భవతి తథాస్యాయ ప్రకాశం । ఘర్మం- అన్యస్య వస్తునో దీపకం - తస్య భాసా సర్వమిదం విభాతీతి- శ్రుతేః- వేనం- కాన్తం- సర్వదుఃఖరాహిత్యేన తస్య కమనీయత్వం । దశధా- చిత్తి స్రుగిత్యాది దశహోతృమన్త్రే ప్రతిపాదితైరాకారైః- చరన్తం- లోకే వ్యవహరన్తం - అన్తస్సముద్రే- బ్రహ్మాణ్డసృష్టేః పురా సర్వత్ర వ్యాప్యైవ స్థితో యోऽయం జల సంఘః- సోऽయ సముద్రస్తస్య మధ్యే మనసా చరన్తం - ఇదం సర్వం జగత్స్రక్ష్యేయమిత్యేవం రూపేణ మనోవృత్తి విశేషేణ సహ ప్రవర్త మానం। అత ఏవాన్యత్రోక్తం। ఆపో వా ఇదమగ్రే సలిలమేవ । స ప్రజా పతిరేకః పుష్కరపర్ణే సమభవత్ । తస్యాన్తర్మనసి కామః స్సమవర్తత।

ఇదగ్ం సృజేయమితీతి। బ్రహ్మా- చతుర్ముఖః- ప్రజాపతిః- అగ్నే-అర్ణవే- యథోక్తసముద్రే- దశహోతారం- దశహోతృమంత్రం- తత్ప్రతిపాద్యరూపేణా విఖ్యాతం- పరమాత్మానం- అన్వవిందత్ - సృష్టిసాధనత్వేనా న్విష్యలబ్ధవాన్। తథాచబ్రాహ్మణమామ్నాతం । ప్రజాపతిరకామయత ప్రజాస్సృజేయేతి। సఏతందశహోతారమపశ్యదితి। సోయమేవం విధః పరమాత్మా జనానాం సర్వేషాంశాస్తా - అన్తర్యామిరూపేణ నియామకస్సన్ హృదయేప్రవిశ్యావస్థితః । తథాచస్మర్యతే॥ శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి । భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥ ఇతి। సర్వాంతర్యామీస్వకీయేన ఈశ్వరరూపేణ- ఏకః- ఏవ- సన్- పునర్జీవరూపేణ-బహుధాభూత్వా- విచారః - వివిధచరణవాన్భవతి । అతఏవాన్యత్రోప నిషద్యుచ్యతే॥

శ్లో॥ ఏకఏవహిభూతాత్మా భూతేభూతేవ్యవస్థితః ।
ఏకథాబహుధాచైవ దృశ్యతేజలచంద్రవత్ ॥

శతగ్ం శుక్రాణి- శతసంఖ్యోప లక్షితాన్యనంతాని - సూర్యచంద్రనక్షత్రాణి జ్యోతీంషి- యత్ర- యస్మిన్- పరమాత్మని - ఏకీభవంతి- ఏకత్వం ప్రాప్నువంతి। తథాసర్వేవేదాః - ఋగ్వేదప్రభృతయశ్చత్వారోవేదాః నానావిధశాఖోపేతాః- విలీయ- యస్మిన్- ఏకీభవంతి- హోతారః- చ- హోమకర్తారః- సర్వే- యజమానాః- దశహోత్రాదిమంత్రావా- యస్మిన్ పరమాత్మని-ఏకత్వం ప్రాప్నువంతి। యథాబుద్బుదాః - జలమధ్యేసముత్పద్య - కంచిత్కాలమవస్థాయ- విలీయమానాజల ఏవైక్యం ప్రాప్నువంతి - తథాసర్వేభావాః - పరబ్రహ్మణఏవ- ఉత్పద్య - తత్రైవస్థిత్వా - విలీయమానా ఏకతాంగచ్ఛంతి। అతఏవ- ఉపనిషదిశ్రూయతే। యతోవా ఇమాని భూతాని జాయంతే। యేనజాతానిజీవంతి। యత్ప్రయంత్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి॥ సః- తాదృశః- ఈశ్వరః - సర్వేషాం - భూతానాం- ఆత్మా- స్వరూపభూతస్సన్- మానసీనః- యోగియుక్తేన మనసా- ఉపలభ్యోభవతి। తథాచకఠా ఆధీయంతే॥ మనసైవేద మాప్త

వ్యం నేహనానాస్తికించన॥ ఇతి। తతో యోగినాం సమానస ప్రత్యక్ష గమ్యత్వాత్ - అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానామితి। యోయముక్తః- సోయం- సర్వాత్మా- సర్వేషాం ప్రాణినామాత్మ స్వరూపభూతః। తేహి జనాః- యోగేననిరుద్ధచిత్తాస్సంతో- జగదీశ్వరం స్వస్వరూపత్వేనైవ సాక్షాత్కుర్వంతి। నతుభేదేనపశ్యంతి। అతఃపూర్వోక్తస్సర్వో ప్యర్థః- ఉపపన్నః- ఇత్యుపసంహ్రియతే। సర్వాః- ప్రజాః - దేవమనుష్యాదయః- యత్రయస్మిన్- యోగిప్రత్యక్షగమ్యే- చైతన్యస్యైకరసే పరమాత్మని- ఏకీభవంతి - చతుర్హోతృమంత్రాశ్చ - సర్వేయస్మిన్- స్వప్రతిపాద్యైః- దేవైః- సహ- యస్మిన్- బ్రహ్మణి- సంపదం- సమ్యగేకీభావం- ప్రాప్నువంతి। సః- తాదృశబ్రహ్మస్వరూపః- మానసీనః- మానసప్రత్యక్షః- సర్వేషాం- జనానామాత్మా- ఋచాం- భేదాత్ - అపునరుక్తిర్ద్రష్టవ్యా। ద్వితీయా- ద్విపదా-ఇతరాస్త్రిస్రశ్చతుష్పదాః- ఇతి- ఋచాంవివేకః- అత్రచతుర్హోతృశబ్దేన దశహోత్రాదయస్సర్వేపి మంత్రావివక్ష్యంతే। తథాచబ్రాహ్మణే- చతుర్హోతృదేవం ప్రతిప్రజాపతిర్వరందత్తవాన్। త్వాంవై మేనేదిష్ఠగ్ం హోతఃప్రత్యశ్రౌషీః త్వయైతానాఖ్యాతార ఇతి। తస్మాన్నుహైనాగ్శ్చతుర్హోతార ఇత్యాచక్షత ఇతి॥

## ప్రతిపదార్థం.

టీక॥ సువర్ణం=బంగారుతో సమానమైనట్టియు, ఘర్మం=ఇతరమగువస్తువులనుకూడ ప్రకాశింపజేయునదియు, వేనం=ఆనందకరమైనదియు, దశధా=పదివిధములుగాను, చరంతం=లోకములో వ్యవహరింపబడునట్టియు, అంతస్సముద్రే=సముద్రమధ్యమను, మనసా=మనోవృత్తితోటి, చరంతం=సంచరించుచున్నట్టియు, ఇంద్రస్య = పరమేశ్వరునియొక్క, ఆత్మానం=నిజస్వరూపమును, అహం=నేను, జానామి=తెలిసికొందును, దశహోతారం=అట్టిదశహోతృస్వరూపమగు పరమాత్మను, అర్ణే=సముద్రమునందు, బ్రహ్మ=చతుర్ముఖబ్రహ్మ, అన్వవిందత్=చూచెను, సః=అటువంటిపరమాత్మ, జనానాం=సమస్తభూతముల యొక్క, అంతః=శరీరమధ్యవర్తియగుచు, శాస్తా=ప్రాణులను నియమించుచుండును, ఏకస్సన్=తానొక్కడేయగుచు, బహుధా=అనేకరూపములుగ, విచారః=ప్రవర్తించెను, శతం=అనేకమైన, శుక్రాణి=సూర్య చంద్ర నక్షత్రాది స్వరూపములు, యత్ర=ఏపరమాత్మయందు, ఏకంభవంతి=కలసియుండునో, సర్వే=సమస్తమైన, వేదాః = ఋగ్వేదము మొ

దలగునవి, యత్ర=ఏపరమాత్మయందు, ఏకంభవంతి = కలిసియుండునో, సర్వే=సమస్తమైన, హోతారః=హోమకర్తలు, యత్ర=ఏపరమాత్మయందు, ఏకంభవంతి=కలిసియుందురో, సః=అటువంటి యీశ్వరుడు, జనానాం=భూతములయొక్క, ఆత్మా= స్వరూపమగుచు, మానసీనః=మనోవృత్తిచే దెలిసికొనతగినవాడగుచున్నాడు, సర్వాత్మా= సమస్తప్రాణులస్వరూపమగు, సః=ఆయీశ్వరుడు, జనానాం= సమస్తభూతములయొక్క, అంతఃప్రవిష్టః=జీవరూపముగలోపల ప్రవేశించినవాడగుచు, శాస్తా=నియామకుడగును, సర్వాః ప్రజాః=సమస్తప్రజలు, యత్ర=ఏపరమాత్మయందు, ఏకంభవంతి = కూడియుండునో, చతుర్హోతారః=చతుర్హోత్రమంత్రములున్నూ, దైవైః=దేవతలతోకూడ, యత్ర=ఏపరమాత్మయందు, సంపదం=కూడియుండుటను, గచ్ఛంతి=పొందుచున్నవో, మానసీనః=మనస్సుచేతను తెలిసికొనతగినటువంటి, సః=ఆపరమాత్మ, జనానాం = సమస్తభూతములయొక్క, ఆత్మా = స్వరూపమైయున్నది.

తా॥ ఇప్పుడు హోతృహృదయముల సంబంధమగు మంత్రములు చెప్పఁబడుచున్నవి. "హృదయంయజుాగంషిపత్న్యశ్చ" అని చాతుర్హోత్రియమంత్ర బ్రాహ్మణమందు ఆమంత్రములకు వినియోగము చెప్పబడినది. దానిలో దశహోతృహృదయసంబంధమగు మంత్రము చెప్పబడుచున్నది. (౧) సువర్ణం.ఘర్మం పరివేద వేనం, అనునది మొదలు 'సమానసీన ఆత్మాజనానాం' (౧) అనుపర్యంతము చెప్పబడుచున్నది. "చిత్తిస్స్రుక్" అనునవి మొదలైన హోతృమంత్రములయొక్క రహస్యమగు పరమాత్మస్వరూపమును ఈయనువాకము ప్రతిపాదించును కాఁబట్టి యీయనువాకము హృదయమని చెప్పబడును. అందులోను యీ మొదటిమంత్రముచే దశహోతలయొక్క హృదయమగు పరమాత్మతత్వము చెప్పఁబడుచున్నది. బంగారువలెనే స్వతస్సిద్ధముగా ప్రకాశించుచున్నదియు, తాను స్వయముగానే ప్రకాశించుచు నితరపదార్థములనుకూడ ప్రకాశింపజేయునదియు, సమస్తదుఃఖరహితమైనదియు, "చిత్తిస్స్రుక్" అను మొదలగు దశహోతృమంత్రములలో ప్రతిపాదనచేయబడిన పది విధములగు నాకారములచే లోకములో వ్యవహరింపబడునదియు, ఈ ప్రపంచసృష్టికి పూర్వము సమస్తప్రదేశములవ్యాపించియున్నట్టి మహాసముద్రమునందుండి ప్రపంచము నేవిధముగ సృజియించెదనని మనస్సున సంకల్పములు కలిగి సంచరించుచున్నాడును, యిందునుగురించి వేదములోచెప్పబడినదేమనగా. సృష్టికిపూర్వము నిదియంతయు జలముచే వ్యాపించియున్నదనియు నాయుదకములో తామరాకుమీదనుండి యీ ప్రపంచము నే విధముగ సృజించెదనని మనస్సున సంకల్పముకలవాడైయుండెనని 'ఆపోవాఇదమాసన్ సలిలమేవ' అను శ్రుతిచెప్పుచున్నదియు. సమస్తదిక్కులను వ్యాపించియున్న పరమాత్మ

స్వరూపమును తెలిసికొనెదను. మఱియు చతుర్ముఖబ్రహ్మ సృష్టిక్రపారంభకాలమందు సముద్రములోదిరుగుచు దశహోత్రుమంత్రమును సృష్టికిసాధనమునుగా తెలిసినోనినవాడై తన్మంత్ర ప్రతిపాద్యుడగు పరమాత్మనుకూడ తెలిసికొనెను. "ప్రజాపతిరకామయత" అనునట్టి శ్రుతియు నీయర్థమునేబోధించుచున్నది. ఇట్టిపరమాత్మ సమస్త ప్రాణులయొక్క హృదయమందు నంతర్యామి స్వరూపముగానుండి సర్వజంతువులను నియామకుడైయుండును. దీనినే శ్రీకృష్ణమూర్తి అర్జునునకు భగవద్గీతలతో జెప్పినదేమనగా, ఓయర్జునా! భగవంతుడు సమస్తభూతముల హృదయమందుండి యంత్రములోని వస్తువులనువలెనే తనమాయచే త్రిప్పుచుండును, అనిచెప్పెను. మఱియు తానొక్కడే ప్రతిశరీరమునందు నంతర్యామిగానుండి జీవస్వరూపముచే ననేకరూపములుగా తెలిసికొనబడుచున్నది. ఇందు నుగురించి మరియొకప్రమాణము చెప్పినదేమనగా, ఒక్కపరమాత్మయే ప్రతిభూతమునందుండి యుదకములో గనబడునట్టి చంద్రుడువలెనే యొకప్పుడు ఒక్కరూపముగాను ఒకప్పుడు ననేకరూపములుగాను జూడబడుచుండును. అనంతములైన సూర్య చంద్ర నక్షత్రములు మొదలగు తేజోరూపములన్నియు నే పరమాత్మయందు నేకీభూతములైయున్నవో ఋగ్వేదము మొదలగు నాలుగువేదములును శాఖోపశాఖలుగా విభజింపబడినవన్నియు నేపరమాత్మయందు నేకత్వముగనుండియున్నవో. హోమకర్తలగు సమస్తయజమానులును లేక దశహోత్రాదిమంత్రములుగాని యేపరమాత్మయందు నేకీభూతముగానున్నవో. అది యెట్లనగా జలమునందు నీటిబుగ్గలుద్భవించి కొంచెముకాలముండి తిరిగి యాజలమునందే యణగిపోనట్లు సమస్తభావములును పరబ్రహ్మమునందే యుద్భవించి యచ్చటనే ప్రవర్తిల్లుచు ప్రళయకాలమునందు నాపరబ్రహ్మమునందే లీనమగును. ఇందునుగురించి "యతోవా ఇమానిభూతానిజాయంతే—తద్బ్రహ్మేతి" అనునట్టి శ్రుతియుచెప్పినదేమనగా, సమస్తభూతములును పరమాత్మయందేపుట్టి దానియందేపెరిగి దానియందే లీనమగుగాన నదియే పరమాత్మయని దెలిసికొనుమని భృగువునకు తండ్రియగు వరుణదేవుఁడు చెప్పినట్లున్నది. కాఁబట్టి అటువంటి పరమాత్మ సమస్తప్రాణులస్వరూపమైనవాడుగా బ్రకాశించుచున్నందున నట్టిపరమాత్మను శ్రవణమనన నిదిధ్యాసనా రూపమగు మనోవృత్తితో దెలిసికొనవలయును. ఇదియంతయు పరమాత్మస్వరూపమే దీనికంటె నితరమైనదేమియు లేదు. దానినిమనస్సుచేతనే దెలిసికొనవలయును. అని కఠశ్రుతియుజెప్పెను. అందువల్లనే యోగీశ్వరులు మానసమున పత్యక్షముజేసికొందురు. మరియు సమస్తప్రాణులకు నంతర్యామిగానున్నందున జ్ఞానులైనవారు యోగము నవలంబించి చిత్తమునిరోధించినవార

గుచు జగదీశ్వరుడగు పరమాత్మను తమస్వరూపముసుగా బ్రత్యక్షమును జేసికొందురు, కాఁబట్టి పూర్వము జెప్పబడిన విషయములన్నియు శ్రుతియుక్త్యాదుల ననుసరించియేయున్నవి. మరియు దేవతులు మనుష్యులు మొదలగువారందరును యోగీశ్వరులచే ప్రత్యక్షము చేసికొనబడునదియు చైతన్యస్వరూపమైనదియునగు నేపరమాత్మయందు నేకీభూతముగా నుందురో చతుర్హోతృమంత్రములును ఆమంత్రములచే ప్రతిపాదింపబడు దేవతలును ఏపరమాత్మయందు ఏకీభూతము గానుండెనో అట్టి పరమాత్మ సమస్తభూతములకు నాత్మస్వరూపమైనందున యోగయుక్తమగు మనస్సుచేతనే దెలిసికొనవలయునని శ్రుతిచెప్పుచున్నది. ఇక్కడ చెప్పినవిషయమునే తిరిగిచెప్పబడినది. ఋక్కులు భేదముగానుండుటచే పునరుక్తి దోషములేదు రెండవఋక్కు రెండుపాదములుకలవిగాను యితర మూడుఋక్కులు నాలుగుపాదములుకలవిగానున్నవి. అందువలన ఋక్కులుభేదముగానున్నవి. ఇచ్చటచతుర్హోతృశబ్దములచేతనే దశహోతృమంత్రములను చెప్పఁబడుచున్నవి. అదియెట్లనగా 'త్వం వై మే నేదిష్ఠగ్ం—చతుర్హోతార ఇత్యాచక్షతే' అనునట్టి శ్రుతివలన చతుర్హోతృదేవతను గురించి ప్రజాపతి వరమునిచ్చునట్లు బ్రాహ్మణములో జెప్పఁబడెను.

## అథ ద్వితీయమంత్రమాహ.

(౨) బ్రహ్మేంద్రమగ్నింజగతః ప్రతిష్ఠాం । దివఆత్మానగ్ం సవితారం బృహస్పతిం। చతుర్హోతారం ప్రదిశోఽనుక్లృప్తం। వాచోవీర్యం తపసాఽన్వవిందత్ ॥

## అథ భాష్యమ్.

తదేవం దశహోతృహృదయాఖ్యో మంత్రోఽభిహితః । అథ చతుర్హోతృహృదయాఖ్యో మంత్రోఽభిధీయతే । తత్ర తిసృఋచస్తాసు ప్రథమామాహ॥ (౨) బ్రహ్మేంద్రమగ్నిం— తపసాన్వవిన్దత్ (౨) ఇతి। బ్రహ్మ- చతుర్ముఖః- ఇంద్రం- పరమైశ్వర్యయుక్తం - పరమాత్మానం- తపసా- అన్వవిన్దత్ - అన్విష్యలబ్ధవాన్ । తద్దర్శపూర్ణమాసః- సృష్టిసాధనం- కిమితివిచార్య- చతుర్హోతృమంత్రరూపేణ - అవస్థితం- పరమాత్మానం- నిశ్చితవానిత్యర్థః- తథాచబ్రాహ్మణ ఆమ్నాయతే। ప్రజాపతిరకామయత దర్శపూర్ణమాసౌ సృజేయేతి । సఏతంచతుర్హోతార మపశ్యదితి। కీదృశమింద్రం- జగతః- ప్రతిష్ఠాం- అగ్నిం- సర్వ

స్యజగత ఆధారరూపో యోఽయం చాతుర్హోత్రీయ చితిరోపోఽగ్నిః- తత్స్వరూపం- దివఆత్మానం- సవితారం - ద్యులోకస్య ప్రకాశత్వే నాత్మవదవస్థితోఽయ స్సవితా- తద్రూపం- తథా- బృహస్పతిః-యో యం- దేవగురుః- తద్రూపేణావస్థితం- ప్రదిశః- సర్వాన్ ప్రదేశాన్- అనుక్లృప్తం - సర్వేషు ప్రదేశేష్వవస్థితం - చతుర్హోతారం - పృథివీ హోతేత్యాది మంత్రస్వరూపం- వాచః- వీర్యం- సర్వస్యా వేదరూపాయాః వాచః సారభూతం। ఏవంభూతం పరమాత్మస్వరూపం బ్రహ్మా న్వవిందదితి పూర్వేణాన్వయః॥

## ప్రతిపదార్థం.

టీక॥ జగతః=ప్రపంచమునకు, ప్రతిష్ఠాం=ఆధారమగు, అగ్నిం=అగ్నిహోత్రస్వరూపమైనదియు, దివః=స్వర్గమునకు, ఆత్మానం=ఆత్మగానున్నటువంటి, సవితారం=సూర్యస్వరూపమైనదియు, బృహస్పతిం=బృహస్పతిస్వరూపముగ నున్నదియు, ప్రదిశః=అన్నిప్రదేశములను, అనుక్లృప్తం=వ్యాపించియున్నదియు, చతుర్హోతారం=చతుర్హోతస్వరూపమైనదియు, వాచః = వాక్కులయొక్క, వీర్యం=సారభూతమైన, ఇంద్రం=పరమాత్మను, బ్రహ్మ=చతుర్ముఖబ్రహ్మ, తపసా=జ్ఞానదృష్టిచే, అన్వవిందత్=విచారించి తెలిసికొనెను.

తా॥ దశహోతృహృదయ సంబంధమగు మంత్రమును జెప్పి యిప్పుడు చతుర్హోతృహృదయసంబంధమగు మంత్రమును జెప్పుచున్నాడు. అందును గురించి మూడు ఋక్కులు కలవు. వానిలో మొదటిఋక్కును గురించి చెప్పుచున్నాడు దర్శపూర్ణమాసమును సృష్టి జేయుటకు సాధనమైనదానిగా దలచి తద్రూపమగు చతుర్హోతృమంత్రస్వరూపమైన పరమాత్మను జ్ఞానరూపమగు దృష్టిచే నిశ్చయించి తెలిసికొనెను. ఆవిధముగానే "ప్రజాపతిరకామయత" అను శ్రుతివలనను చెప్పఁబడెను. ఈ పరమాత్మ యెటువంటివాడనగా, చాతుర్హోత్రీయరూపమై సమస్తప్రపంచమునకు నాధారమగు నగ్నిహోత్రస్వరూపముగాను స్వర్గలోకము మొదలగు వానినన్నింటిని ప్రకాశింపజేయుటచే సూర్యస్వరూపముగాను, దేవతాగురువగు బృహస్పతిస్వరూపముగాను, సమస్తదిక్కులను వ్యాపించియున్నదానిగాను "పృథివీహోతా" అనునది మొదలు చతుహోతృమంత్ర స్వరూపమైనదిగాను, సమస్తవేదవాక్కులు మొదలగు వానినన్నింటియొక్క సారభూతమైనదిగాను నున్నట్టి పరమాత్మను చతుర్ముఖ బ్రహ్మజ్ఞానముచే విచారించి తెలిసికొనెను.

తృతీయమంత్ర మాహ.

(3) అన్తః ప్రవిష్టంకర్తార మేతం। త్వష్టారంరూపాణి వికుర్వాంతం విపశ్చిం। అమృతస్యప్రాణంయజ్ఞ మేతం। చతుర్హోతౄణా మాత్మానం కవయోనిచిక్యుః॥ (3)

అథ భాష్యమ్.

అథ తృతీయామృచమాహ। (3) అన్తఃప్రవిష్టం కర్తార మేతం-కవయోనిచిక్యుః। (3) ఇతి। కవయః- విద్వాంసః - వేదశాస్త్రపారంగతాః- చతుర్హోతౄణాం- చతుర్హోతృశబ్దేనాభిధీయ మానానాం సర్వేషాం హోతృమంత్రాణాం- ఆత్మానం- స్వరూపభూతం - పరమేశ్వరం- నిచిక్యుః- నిశ్చితవంతః- కీదృశమాత్మానం- అంతఃప్రవిష్టం-జీవరూపేణ శరీరేషు ప్రవిశ్యావస్థితం - అతఏవామ్నాయతే। అనేనజీవేనాత్మనాను ప్రవిశ్యేతి। కర్తారమేతం- అహమిత్యనేన మానసప్రత్యక్షేణ- ప్రతీయమానం- లౌకికవైదికసర్వక్రియా నిష్పాదకం। ఏతచ్చాన్యత్రామ్నాతం। ఏషహిద్రష్టాస్రష్టాశ్రోతా ప్రష్టాఘ్రాతారసయితామంతాబోద్ధా కర్తావిజ్ఞానాత్మా పురుషఇతి। రూపాణి వికుర్వంతం-విపశ్చితం- త్వష్టారం- గర్భేషు- దేవతిర్యఙ్మనుష్యాది రూపేణ - రూపాణి- వివిధం నిష్పాదయంతం। త్వష్టృదేవస్వరూపం। ఏతదప్యామ్నాతం। యావచ్ఛోవై రేతసస్సిక్తస్య త్వష్టారూపాణి వికరోతి తావచ్ఛోవై తత్ప్రజాయతఇతి॥ విపశ్చిం- విపశ్చితం- తత్తద్రూపనిర్మాణ ప్రకారాభిజ్ఞం। అమృతస్య ప్రాణం- మరణరహితస్య పరమాత్మనో వ్యవహారహేతుభూత ప్రాణోపాధిస్వరూపం - ఏతదప్యాథర్వణికా ఆమనంతి। కస్మిన్న్వహముత్క్రాంత ఉత్క్రాంతో భవిష్యామి। కస్మిన్వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామీతి। సప్రాణమసృజతేతి। యజ్ఞమేవసర్వైరనుష్ఠీయమానత్వేన దృశ్యమానమేతం దర్శపూర్ణమాస యజ్ఞస్వరూపం- చతుర్హోతృమంత్రస్య తద్యజ్ఞ సృష్టిసాధనత్వాత్ - తద్రూపత్వం యుక్తం। తద్యజ్ఞ సాధనత్వం బ్రాహ్మణేసమామ్నాతం। సఏతంచతుర్హోతారమపశ్యత్। తంమనసానుద్రుత్యాహవనీయే జుహోత్। తతోవైస దర్శపూర్ణమాసావ సృజతేతి॥ ఇతి తృతీయమంత్రః॥

## ప్రతిపదార్థం.

టీక॥ అంతఃప్రవిష్టం=జీవస్వరూపముగా దేహములయందు నున్నట్టియు, కర్తారం=సమస్తమునకు కర్తయగునట్టియు, త్వష్టారం=బ్రహ్మస్వరూపమైనదిగనుక నే, రూపాణి=సమస్తప్రాణిరూపములను, వికుర్వంతం = చేయునట్టిదియు, విపశ్చిం=సర్వక్రియలను తెలిసికొనునదియు, అమృతస్య=మరణరహితమైనదానికి, ప్రాణం = ప్రాణమైనదియు, యజ్ఞం=యజ్ఞస్వరూపమైనదియు, చతుర్హోత్రాణాం=చతుర్హోత్రమంత్రములకు, ఆత్మానం= ఆత్మస్వరూపమును, కవయః=విద్వాంసులు, నిచిక్యుః=నిశ్చయించిరి.

తా॥ కూడవబుద్ధ్యనుగుణించి చెప్పుచున్నాడు. జీవరూపముగా సమస్తశరీరములయందు ప్రవేశించియున్నదియు (ఈపరమాత్మయే జీవరూపముగ ప్రవేశించినదని శ్రుతియందు జెప్పఁబడినది.) నేను అనెడు మనోవృత్తిచే ప్రత్యక్షముగ తోచబడినదియు, లౌకికసంబంధమైనవియు వైదికసంబంధమైన సమస్తక్రియలకు నాధారమైనదియు, దీని నిగురించి శ్రుతియందు జెప్పఁబడినదేమనగా, చూచునదియు స్పృశించునదియు చూచునదియు వాసనచూచునదియు రుచిచూచునదియు తలచునదియు తెలిసికొనునదియు చేయునదియు విజ్ఞానస్వరూపమైనదియు ఈపురుషుడేయని చెప్పఁబడెను. మరియు దేవతిర్యఙ్మనుష్యాది సమస్తదేహరూపములను జేయునదియు కనుకనే బ్రహ్మస్వరూపమైనదియు, నేయేరూపముల నేయేప్రకారముగా జేయవలయునో ఆవిధానము నంతయు గుర్తెరింగినదియు, జననమరణరహితమగు పరమాత్మయే సర్వవ్యవహారమునకు హేతుభూతముగ శరీరత్రయవిశిష్టమై ప్రాణరూపముగ నగపడునదియు, సమస్తమైనవారిచేతను జేయదగినదర్శపూర్ణమాస యజ్ఞస్వరూపమైనదియు, చతుర్హోత్రశబ్దముచే జెప్పబడెడి సమస్తహోత్రమంత్రముల స్వరూపమగు పరమాత్మను విద్వాంసులు జ్ఞానముచే విచారణజేసి తనయాత్మనుగానిశ్చయించినవారైరి. "సవితంచతుర్హోతారమపశ్యత్ — దర్శపూర్ణమాసా అసృజత" అనిబ్రాహ్మణములో చతుర్హోత్రమంత్రము యజ్ఞమునకు సాధనముగ జెప్పఁబడెను.

## అథ చతుర్థమంత్రమాహ.

(౪) అంతఃప్రవిష్టం కర్తారమేతం । దేవానాం బంధునిహితం గుహాసు। అమృతేనక్లుప్తం యజ్ఞమేతం । చతుర్హోత్రాణామాత్మానం కవయోనిచిక్యుః॥ (౪) ఇతి చతుర్థమంత్రః॥

## అ థ భా ష్య మ్.

అథ చతుర్థమంత్రమాహా। (౪) అంతః ప్రవిష్టంకర్తార మేతం—కవయోనిచిక్యుః॥ (౪) ఇతి। యోయం పరమాత్మాసోయం- దేవానాం- బంధువత్ప్రియః। తాదృశం- తేషుదేవేషు- పక్షపాతత్వేనవిజయహేతుత్వం- అతఏవ- తలవకారాః। ఆమనంతి। బ్రహ్మైవ దేవేభ్యోవిజిగ్యేఇతి। గుహాసు- బుద్ధిసు- నిహితం- సాక్షిత్వేనావస్థితం - యోవేదనిహితం గుహాయామిత్యాదిశ్రుతేః । అమృతేన - స్వర్గఫలనిమిత్తేన క్లుప్తం- సంపాదితం- ఏతం- యజ్ఞం- ఇత్యాదీనామితి॥

## ప్రతి ప దా ర్థం.

టీక॥ అంతఃప్రవిష్టం=జీవరూపముగ శరీరమునందు ప్రవేశించియున్నట్టియు, కర్తారం=సృష్టికర్తయైనట్టియు, దేవానాం=దేవతులకు, బంధుం=బంధువువలెనే ప్రియమైనట్టియు, గుహాసు=అంతకరణలయందు, నిహితం=సాక్షిగనున్నట్టియు, అమృతేన=అమృతస్వరూపిముచే, క్లుప్తం=ప్రకాశించునట్టియు, యజ్ఞం=యజ్ఞస్వరూపమైనదియు, చతుర్హోతౄణాం=చతుర్హోతలయొక్క, ఆత్మానం=హృదయస్వరూపముగు, ఏతం=ఈపరమాత్మను కవయః=విద్వాంసులు, నిచిక్యుః=నిశ్చయించి తెలిసికొనిరి.

తా॥ నాలుగవఋక్కునుగురించి చెప్పఁబడుచున్నది. దేవతులు సద్బుద్ధితోగూడినవారగుటచే నా దేవతులకు బంధువువలెనే ప్రియమయినవాడును, ప్రతిప్రాణియొక్కయు నంతఃకరణమునందు సాక్షిస్వరూపముగనున్నవాడును, స్వర్గాధిఫలముల నొసగుటచే నమృతస్వరూపముగ తోచబడునట్టివాడును యజ్ఞస్వరూపుడును, చతుర్హోతృమంత్రములయొక్క హృదయముగు పరమాత్మను విద్వాంసులు తమయాత్మనుగా విచారించి తెలిసికొనిరి.

## అథ పంచమ మంత్రమాహా.

(౫) శతంనియుతః పరివేదవిశ్వా విశ్వవారః। విశ్వామిదంవృణాతి। ఇంద్రస్యాత్మానిహితః పంచహోతా । అమృతం దేవానామాయుః ప్రజానాం॥

## అథ భాష్యమ్.

తదేవమృక్త్రియరూపం చతుర్హోతృహృదయముక్తం। అథపంచ

హోతృ హృదయాఖ్యో మంత్రోఽభిధీయతే। తత్ర ప్రథమమాహ॥(౫) శతంనియుతః — ప్రజానాం॥ (౫) ఇతి। పంచహోతా - అగ్నిర్హోతా ఇత్యాది పంచహోతృమంత్రరూపః। ఆత్మా- స్వీయ విశ్వవారః - సర్వై ర్వరణీయో వాయురూపస్సన్ - శతంనియుతః- శతసంఖ్యాకానశ్వాన్ స్వకీయాన్ సర్వాన్ - పరివేద- పరిత స్సంభావితత్వేన జానాతి। అతఏవ- ఇదంవిశ్వం- జగత్ - వృణాతి- వ్యాప్నోతి- సోయం-ఇంద్రస్యాత్మా- పరమేశ్వరస్య స్వరూప భూతస్సన్ - నిహితః- సర్వత్రావస్థితః- సచ- దేవానామమృతం- ప్రయచ్ఛతి - ప్రజానాంవా - ఆయుః - ప్రయ చ్ఛతీతి శేషః॥

## ప్రతిపదార్థం.

టీక॥ విశ్వవారః=సర్వప్రాణులచేత కోరతగినవాడు, శతం=అనేకములగు, విశ్వాః= గుఱ్ఱములను, నియుతః=నియమించుచున్నవాడై, యః=ఏవాయువు, పరివేద=తెలిసికొను చున్నాడో, ఇదం=ఈ, విశ్వం=ప్రపంచమును, వృణాతి=వ్యాపించుచున్నాడో, పంచ హోతా=పంచహోతృమంత్రస్వరూపుడును, నిహితః=అంతటను వ్యాపించినవాడును, ఇం ద్రస్య=పరమేశ్వరునియొక్క, ఆత్మా=స్వరూపుడైన, సః=ఆవాయువు, దేవానాం=దేవ తులకు, అమృతం=అమృతమును, ప్రజానాం=ప్రజలకు, ఆయుః = ఆయుర్దాయమును, ఇచ్చుచున్నాడు.

తా॥ ఇది వరకు నాలుగుఋక్కులుగల చతుర్హోతృ హృదయమంత్రమునుఁ జెప్పి యిప్పుడు పంచహోతృ హృదయభూతమగు మంత్రమును జెప్పుచు నందులో మొదటిఋ క్కును గురించిచెప్పుచున్నాడు. "అగ్నిర్హోతా" అను మొదలగు పంచహోతృమంత్ర స్వరూపుడును అనేకములగు నశ్వములనుఎక్కి ప్రపంచమును సర్వమునుదిరుగుచు వ్యా పించియున్నవాడును పరమాత్మస్వరూపుడునగు వాయుదేవతులకు నమృతమును ప్రజలకు నాయుర్దాయమునిచ్చి వృద్ధినొందించుచుండును.

## అథ షష్ఠమంత్రమాహ.

(౬) ఇంద్రగ్ం రాజానగ్ం సవితారమేతం। వాయోరాత్మానం కవయోనిచిక్యుః। రశ్మిగ్ం రశ్మీనాం మధ్యేతపన్తం। ఋతస్యపదే కవయోనిపాన్తి॥ ౬)

అథ భాష్యమ్.

అథ షష్ఠమంత్రమాహ॥ ౬॥ ఇంద్రిగ్ం రాజానగ్ం— నిపాన్తి॥ (౬) ఇతి॥ ఏవంచతుర్హోత్రుదేవం- కవయః- పండితాః- నిచిక్యుః- విని శ్చితవంతః। కీదృశం- ఇంద్రం- పరమైశ్వర్యయుక్తం- రాజానం- దీప్య మానం- సవితారం- ప్రేరకం- వాయోః- ఆత్మానం - స్వరూపభూ తం- తే-కవయః- ఏతం- చతుర్హోత్రుదేవం- ఋతస్య- పదే- బ్రహ్మణ స్థానే- నిపాంతి- నితరాంపాలయంతి। తద్రూపత్వేనైవపశ్యంతీత్యర్థః॥ కీదృశం- రశ్మీనాం- దృశ్యమానానాం కిరణానాం- మధ్యే- స్థిత్వా- తపన్తం-జగత్తాపంకుర్వంతం।రశ్మిం-ప్రౌఢరశ్మిరూపం-ఆదిత్యమిత్యర్థః॥

ప్రతిపదార్థం,

టీక॥ ఇంద్రిం= పరమైశ్వర్యముతోగూడినదియు, రాజానం=ప్రకాశించునదియు, సవితారం=ప్రేరేపించునదియు, వాయోః=వాయువుయొక్క, ఆత్మానం=స్వరూపమైన దియు, ఏతం=ఈచతుర్హోత్ర మంత్రస్వరూపమును, కవయః=పండితులు, నిచిక్యుః=నిశ్చ యించిరి, తే=ఆపండితులు, రశ్మీనాం=కిరణములయొక్క, మధ్యే=నడుమను, తపంతం= ప్రకాశించునట్టి, రశ్మిం = అధికకాంతిస్వరూపముగు సూర్యుని, ఋతస్య = పరబ్రహ్మము యొక్క పదే=స్థానమునందు, నిపాంతి=మిక్కిలి భావించుచున్నారు.

తా॥ ఇప్పుడు ఆఱవఋక్కును గురించిచెప్పుచున్నాడు. పరమైశ్వర్యయుక్తమైన దియు, ప్రకాశించునదియు, సమస్త ప్రపంచమును ప్రేరేపించునదియు, నగు దేనిని వాయు వుయొక్క స్వరూపమునుగాను పండితులు తలచిరో దానినే సహస్రకిరణములనడుమను విశేష కాంతిచే ప్రకాశించునట్టియు ప్రపంచమునంతయు, ప్రకాశింపజేయునట్టి సూర్యుని గాను తలచుచు పండితులు పరబ్రహ్మస్వరూపమునుగాను భావించుచున్నారు.

అథ సప్తమ మంత్రమాహ.

(౭) యఆణ్డకోశే భువనంబిభర్తి। అనిర్భిణ్ణః సన్నథలోకాన్ విచష్టే। యస్యాణ్డకోశగ్ం శుష్మమాహుః ప్రాణముల్బం। తేనక్లుప్తో ఽమృతేనాహమస్మి॥ (౭)

అథ భాష్యమ్.

అథ సప్తమమంత్రమాహ॥ ౭॥ యఆణ్డకోశే—అమృతేనాహమస్మి॥

౭॥ ఇతి। యః- పంచహోతృదేవః- అండకోశే - బ్రహ్మాండమధ్యే- అనిర్భిణ్ణః- అభేదేనావస్థితస్సన్- భువనం - కృత్స్నం - భూతజాతం- బిభర్తి- ధారయతి। అథ బ్రహ్మాండభేదానంతరం । తదంతస్థితాన్- భూరాదిలోకాన్- విచష్టే- విశేషేణ ప్రఖ్యాపయతి- యస్య - చతుర్హోతృరూపస్య- పరమాత్మనః- శుష్మం- అండకోశం-ప్రబలం-బ్రహ్మాండావకాశస్థం- ప్రాణం- వాయువిశేషం- ఉల్బమాహుః- గర్భవేష్టనస్థానీయమాహుః- యథాలోకే- గర్భః - ఉల్బేన - వేష్ట్యతే - తథా సూక్ష్మశరీరేణ ప్రాణవాయునా- బ్రహ్మాండం- వేష్టితం- భవతి- తేనామృతేన- పంచహోతృరూపేణ - పరమాత్మనా - అహం - క్లుప్తః- వ్యవహార సమర్థత్వేనోత్పాదితో౽స్మి॥

* కరాశ్చామనంతీతి శ్రీమరపుస్తకే.

యస్య - పంచహోతృదేవస్య - అండకోశం - బ్రహ్మాండం- శుష్మం- ఉల్బం- ప్రాణస్వరూపం- ఆహుః- తేన - పంచహోతృరూపేణ- పరమాత్మనా- అహం- క్లుప్తః- వ్యవహారసమర్థత్వేన- ఉత్పాదితః- అస్మిన్- ఇతికాంచీపుస్తకే॥

ప్ర తి ప దా ర్థ ం.

టీక॥ యః=ఏపంచహోతృదేవతా, అండకోశే = బ్రహ్మాండమధ్యమందు, అనిర్భిణ్ణః=అభేదముగానున్నదగుచు, భువనం= సమస్తప్రపంచమును, బిభర్తి=ధరించుచున్నదో, అథ=అనంతరము, లోకాన్ = లోకములను, విచష్టే=విశేషముగా ప్రకటింపజేయునో, యస్య=ఏపరమాత్మయొక్క, శుష్మం=అధికమగు, అండకోశం=బ్రహ్మాండమధ్యయందున్నట్టి, ప్రాణం=ప్రాణము, ఉల్బం= గర్భపిండమును గాను, ఆహుః = చెప్పిరో, తేన=అటువంటి, అమృతేన=పరమాత్మచేత, అహం= నేను, క్లుప్తః=ఏర్పడినవాడనై, అస్మి= అయితిని.

తా॥ ఇప్పుడు సప్తమబుక్కును చెప్పుచున్నాడు. ఏపంచహోతృదేవతారూపమగు పరమాత్మ బ్రహ్మాండకోశములోనభేదముగానున్నట్టి భూర్భువరాది లోకములను ధరించుచున్నాడో పిమ్మట బ్రహ్మాండకోశము భిన్నముకాగానే ఆకోశములోనున్నట్టి లోకములన్నియు ప్రత్యేక ప్రత్యేకముగా నిదిభూలోకమనియు నిదిభువర్లోకమనియు నిది

మవర్ణ్లోకమనియువివరముగా ప్రకటింపజేయుచున్నాడో ఏచతుర్హోతృదేవతాస్వరూపమగు పరమాత్మయొక్క అధికమగుబ్రహ్మాండకోశము ప్రబలమగుప్రాణవాయుస్వరూపమగుసూక్ష్మ శరీరముచేవ్యాపించియున్నదో అమృతస్వరూపమగునట్టిపరమాత్మయే వాస్వరూపము.లోక వ్యవహారార్థము స్థూలసూక్ష్మకారణ శరీరత్రియోపాధి విశిష్టుడనై యేర్పడితిని. లోకములో గర్భపిండము మావిచే జుట్టుకొనబడినట్లుగానే సూక్ష్మశరీరమని వ్యవహరింపబడునట్టిప్రాణ వాయువుచే బ్రహ్మాండమంతయు జుట్టుకొనబడియున్నది. మరియు పంచహోతృదేవతా స్వరూపమగు పరమాత్మయొక్క బ్రహ్మాండ కోశమే ప్రబలమగు ప్రాణస్వరూపమగు బ్రహ్మాండముగాను ఆపంచహోతృదేవతాస్వరూపమగు పరమాత్మయే నేను సమస్తవ్యవహా రనిమిత్తము ఈవిధముగా నేర్పడితిని. అని కాంచీపుస్తకమునందు వ్రాయబడియున్నది.

## అథాష్టమమంత్రమాహ.

(౮) సువర్ణంకోశగ్ం రజసాపరీవృతం । దేవానాంవసుధా నీంవిరాజం । అమృతస్యపూర్ణాంతాముకలాంవిచక్షతే । పాదగ్ం షడ్ఢోతుర్నకిలావివిత్సే॥ ౮॥

## అథ భాష్యమ్.

అథషడ్ఢోతృహృదయమంత్రాః॥ తత్రప్రథమామృచమాహ॥౮॥ సువర్ణం—వివిత్సే॥ ౮॥ ఇతి। వాగ్ఘోతేతి మంత్రోక్తషడ్ఢోతా- సచ- బ్రహ్మాండకోశమధ్యే- చంద్రరూపేణావస్థితః । తంచంద్రరూపం షడ్ఢో తృదేవం- విరాజం - అభిజ్ఞాః - సువర్ణత్వాది గుణయుక్తమాచక్షతే। సువర్ణం- శోభనవర్ణోపేతం- ఏతం - చంద్రమండలం - హిరణ్మయ వర్ణోపేతం- కోశం- బ్రహ్మాండకోశమధ్యగం- రజసా - రంజనాత్మకే నామృతేన- పరీవృతం- సర్వతోవ్యాప్తం- తథావిధం చంద్రం- తా ముకలాం- తాదృశీమేవభాగరూపాం- ఆచక్షతే- కీదృశీమితి తదుచ్యతే। దేవానాం- వసుధానీం- వహ్నిరవ్యాదీనాం- దేవతానామపేక్షితం- యద్వసు- అమృతరూపం- తస్యధారయిత్రీం। అతఏవస్మర్యతే॥ ప్రథమాం పిబతేవహ్ని ర్ద్వితీయాంపిబతేరవిరిత్యాది॥ విరాజం - విశేషేణ రాజమానాం- అమృతస్య- పూర్ణాం- పీయూషేణ- పూరితాం ఏవంరూపం షడ్ఢోతృదేవమభిజ్ఞాః। ఆచక్షతే ప్రాకృతస్తుజనః॥ షడ్ఢో

తుః- పాదం- షడ్ఢోతృదేవస్యాంశ భూతం చంద్రం - నకిలాదివిత్సే నైవజానాతి॥

## ప్రతిపదార్థం.

టీక॥ సువర్ణం=మంచివర్ణముతో గూడినదియు, కోశం=బ్రహ్మాండకోశములోనున్నదియు. రజసా=రక్తిమగుణముతో, పరీవృతం=అంతటను వ్యాపించినదియు, దేవానాం = దేవతులకు, అపేక్షితం=కోరబడునదియు, వసుధానీం=అమృతస్వరూపమగు ధనమునుధరించునదియు, విరాజం = మిక్కిలిప్రకాశించునదియు, అమృతస్య = అమృతముయొక్క, పూర్ణాం=నిండియున్నదియు, తామకలాం=ఆకళనే, ఏతం=ఈచంద్రమండలమునుగాను ఆచక్షతే=చెప్పుచున్నారు, షడ్ఢోతుః = షడ్ఢోతృదేవతయొక్క, పాదం=అంశనుగాను, నకిలాదివిత్సే=అజ్ఞానుడు తెలిసికొనలేడు.

తా॥ ఇప్పుడు షడ్ఢోతృహృదయ మంత్రములు చెప్పఁబడుచున్నవి వానిలో మొదటిమంత్రము (౮) సువర్ణం—వివిత్సే (౮) అనునది. "వాగ్ఘోతా" అనుమంత్రము షడ్ఢోతృమంత్రముగా జెప్పఁబడినది. ఆమంత్రము బ్రహ్మాండకోశములోనుండెడి చంద్రమండలస్వరూపమును ప్రతిపాదించును. ఆనందకరమగు వర్ణముతో గూడినదియు, బ్రహ్మాండకోశములో మధ్యనుండి శ్రేష్ఠమగు నమృతముతో నంతటను వ్యాపించి ప్రకాశించునట్టి యీచంద్రమండలమును సూర్యుడు అగ్నిహోత్రుడు మొదలగు దేవతులచే పానముచేయబడునట్టి చంద్రకళనుగాను తెలిసిన విద్వాంసులుచెప్పిరి. అందువల్లనే చంద్రకళ దేవతులకు ధనముగా కోరదగినదైయున్నది. ఈచంద్రమండలమును షడ్ఢోతృదేవతయొక్క అంశనుగాను మూఢులు తెలిసికొనలేరు.

## అథ నవమ మంత్రమాహ.

(౯) యేన ర్తవః పఞ్చధోతక్లుప్తాః। ఉతవాషడ్ఢామనసోతక్లుప్తాః। తగ్ం షడ్ఢోతారమృతుభిఃకల్పమానం। ఋతస్యపదేకవయోనిపాంతి ౯

## అథ భాష్యమ్.

అథ నవమమాహ॥ ౯ యేన ర్తవః — కవయోనిపాన్తి॥ ౯॥ ఇతి। యేన- చంద్రరూపేణ- షడ్ఢోతృదేవేన- వసన్తాద్యృతవః- పంచ ప్రకారాః- క్లప్తాః- సమ్పాదితాః - హేమంతశిశిరయో స్సమాసేన-

పంచత్వం- ఉతవా- అథవా। హేమంతశిశిరయో ర్విభాగేనషట్సంఖ్యాకాః- క్లుప్తాః- ఉత- అపిచ- మనసా- క్లుప్తాః- సంకల్పమాత్రేణ సంపాదితాః। తం- పంచషడ్ఢోతృదేవం- ఋతుభిః- కల్పమానం- పంచధా- షోఢావా- భిన్నైః- వసంతాదిభిః- సర్వవ్యవహారసమర్థం- ఋతస్య- పదే - సత్యస్య పరబ్రహ్మణఃస్థానే - కవయః - వేదరహస్యాభిజ్ఞాః- నిపాంతి- నితరాంపాలయంతి- పరబ్రహ్మైవాయం చంద్రరూపః-షడ్ఢోతేత్యేవ ముపాసత ఇత్యర్థః॥

ప్రతి ప దా ర్థ ం .

టీక॥ యేన=ఏషడ్ఢోతృదేవతచేత, ఋతవః = వసంతాదిఋతువులు, పంచధా=అయిదువిధములుగాను, క్లుప్తాః=ఏర్పరచబడినవో, ఉతవా=అలాగుకానియెడల, షఢా=ఆరువిధములుగాను కల్పించబడినవో, ఉత=ఇంతేకాదు, మనసా=మనస్సుచేత, క్లుప్తాః=కల్పింపబడినవో, ఋతుభిః=వసంతాదిఋతువులచేత, కల్పమానం = వ్యవహారహేతుభూతుడగు, తం=అషడ్ఢోతృదేవతను, ఋతస్య = సత్యస్వరూపమగు పరబ్రహ్మముయొక్క, పదే=స్థానమునందు, కవయః=వేదరహస్యమును తెలిసివారు, నిపాంతి=భావించుచున్నారు॥

తా॥ ఇప్పుడు రెండవఋక్కును జెప్పుచున్నాడు. చంద్రస్వరూపమగు షడ్ఢోతృదేవతచేతనే వసంతఋతువు మొదలగు నయిదు ఋతువులేర్పడినవి. అయితే ఆరుఋతువులని లోకవ్యవహారమైయుండగా అయిదనిచెప్పుట యెట్లనగా, హేమంత శిశిరఋతువులను రెండింటిని యొక్కఋతువేయని కొందరి యభిప్రాయము. మరియు మరికొందరు హేమంత శిశిరఋతువులను రెంటిని వేరువేరుగా జెప్పుటచే నారు రుతువులని మరికొందరు చెప్పిరి. మనస్సు సంకల్పమాత్రముననే యేర్పడినవని మరికొందరుచెప్పిరి ఇట్లు బహుప్రకారములుగా జెప్పబడినందున అయిదురుతువులనే పక్షములో పంచహోతృదేవతయనియు నారు రుతువులనే పక్షములో షడ్ఢోతృదేవతయనియు, చంద్రుని చెప్పిరి. ఇట్లురెండువిధములచే పంచహోతృ షడ్ఢోతృ దేవతాస్వరూపుడగు చంద్రమండలమును సత్యమైన పరబ్రహ్మస్వరూపమునుగా వేదరహస్యమును తెలిసిన పండితులు చెప్పుచున్నారు.

అథ దశమ మంత్రమాహ.

(౧౦) అంతఃప్రవిష్టం కర్తారమేతం । అంతశ్చంద్రమసి మనసాచరన్తం। సహైవసన్తం నవిజానన్తిదేవాః । ఇన్ద్రస్యాత్మానగ్ం శతధాచరన్తం॥ ౧౦॥

## అథ భాష్యమ్.

అథ తృతీయామాహ॥౧౦॥ అంతః ప్రవిష్టం—శతథాచరంతం॥ ౧౦॥ ఇతి। దేవాః - స్వైస్వస్త్రైవసంతం - స్వకీయ హృదయేస్వేన జీవాత్మనా- సహైవావస్థితం- ఏతం- షడ్ఢోతృదేవం పరమాత్మానం- నవిజానంతి- వేదాంతాభ్యాసమంతరేణ హృదయేఽవస్థితోయం పరమాత్మైవేతి విశేషేణనజానంతి కీదృశంపరమాత్మానం। అంతఃప్రవిష్టం- అంతర్యామిరూపేణ- సర్వేషాం పృథివ్యాది పదార్థానాం-మధ్యే ఉవస్థితం- ఏతచ్చవాజసనేయినోంతర్యామి బ్రాహ్మణే - యఃపృథివ్యాంతిష్ఠన్నిత్యాదినా బహుప్రపంచే నామనంతి। కర్తారం - నియామకత్వేన సర్వస్యనిష్పాదకం। అంతశ్చంద్రమసి। చంద్రమండలమధ్యే మనసా- సంకల్పమాత్రేణ- చరంతం- ఏతచ్చోపలక్షణం- సర్వేష్వపి వస్తుషుచరంతమిత్యర్థః। ఏతదేవస్పష్టీకర్తుం- శతథాచరంతమిత్యుక్తం ఇంద్రస్య- పరమైశ్వర్యయుక్తస్య- దేవాదేః- ఆత్మభూతం- స్వరూపం॥ ఇతి తృతీయాబుక్॥

## ప్రతిపదార్థం.

టీక॥ అంతఃప్రవిష్టం=అంతర్యామిగా ప్రవేశించియున్నట్టియు, కర్తారం=సమస్తమునకు కర్తయగునట్టియు, అంతశ్చంద్రమసి=చంద్రమండలమధ్యను, మనసా=సంకల్పమాత్రముచే, చరంతం=సంచరించుచున్నట్టియు, స్వైవసంతం= జీవస్వరూపముగానున్నట్టియు, శతథా=అనేకరూపములుగా, చరంతం=ప్రవర్తించుచున్నట్టియు, ఇంద్రస్య=ఇంద్రుడు మొదలగు సమస్తమైనవారియొక్క, ఆత్మానం=స్వరూపమగు, ఏతం=ఈషడ్ఢోతృదేవతను, దేవాః=దేవతలు, నవిజానంతి=పరమాత్మస్వరూపమునుగా దెలిసికొనలేరు

తా॥ ఇప్పుడు మూడవఋక్కు చెప్పఁబడుచున్నది. వాజసనేయిశాఖలలోగల యంతర్యామి బ్రాహ్మణమునందు చెప్పఁబడినట్లు అంతర్యామిస్వరూపముగా భూమిమొదలగు సమస్తవస్తుజాలములయందు నిండియున్నట్టియు, సమస్తప్రాణులకు నియామకుడగుటచే కర్తయైనట్టియు, చంద్రమండలములో సంకల్పమాత్రముగానే సంచరించినట్టియు, అనఁగా సమస్తవస్తువులను వ్యాపించినవాడు కనుకనే అనేకరూపములుగా ప్రకాశించుచున్నట్టియు, దేవతలు మొదలగు సమస్తమయినవానిని వ్యాపించియున్నట్టియు, ఈషడ్ఢో

త్ృ దేవతను తమదేహమునందు జీవాత్మస్వరూపముగావ్యాపించియున్నట్టి పరమాత్మనుగాను వేదాంతజ్ఞానాభ్యాసము లేకుండాదేవతులైనను తెలిసికొనలేరైరి.

అథ ఏకాదశ మంత్రమాహ.

(౧౧) ఇన్ద్రోరాజాజగతోయఈశే। సప్తహోతాసప్తధా విక్లుప్తః॥

అథ భాష్యమ్.

అథసప్తహోతృ హృదయాఖ్యోమంత్రః । తత్రప్రథమాంబుచ మాహ॥ ౧౧॥ ఇన్ద్రోరాజా— సప్తధావిక్లుప్తః॥ ౧౧॥ ఇతి। మహాహవిర్హోతేత్యయుంమంత్రః । సప్తహోతా- సచ- సప్తధాక్లుప్తః- హోత్రధ్వర్యు ప్రముఖైస్సప్తభిః ప్రకారైః- సంపాదితః - సకింరూపఇతి తదుచ్యతే। ఇంద్రః- పరమైశ్వర్యయుక్తః - రాజా - దీప్యమానః- యః- పరమాత్మా- జగతః- ఈశః- స్వామీభవతి। సఏవాయం సప్తహోతృరూప ఇత్యర్థః॥

ప్రతిపదార్థం.

టీక॥ ఇంద్రః=పరమైశ్వర్యయుక్తుడును, రాజా = ప్రకాశించువాడును, జగతః= ప్రపంచమునకు, ఈశః=ప్రభువునగు, యః=ఏ, సప్తహోత దేవతకలడో, సః=ఆసప్తహోతదేవత, సప్తధా=ఏడువిధములుగాను, క్లుప్తః=ఏర్పడెను.

తా॥ ఇప్పుడు సప్తహోతృహృదయరూపమగు మంత్రమును గురించి చెప్పబడు చున్నది. దానిలో మొదటిబుక్కు యిట్లు చెప్పుచున్నది అందుకుగురించి "మహాహవిహోతా" యనుమంత్రమైయున్నది, పరమైశ్వర్యయుక్తుడును ప్రకాశించువాడును సమస్తప్రపంచమునకు నధిపతియునగు పరమాత్మయే హోతయనియు , అధ్వర్యుడనియు అగ్నీధ్రుడనియు మొదలగు నేడు విధములుగా నేర్పడిన సప్తహోతృ దేవతయనబడును.

అథ ద్వాదశ మంత్రమాహ.

(౧౨) పరేణతన్తుంపరిషిచ్యమానం అన్తరాదిత్యం మనసాచరన్తం । దేవానాగ్ం హృదయం బ్రహ్మాన్వవిన్దత్ ॥ ౧౨॥

అథ భాష్యమ్.

అథ ద్వితీయమాహ॥ ౧౨॥ పరేణతన్తుం— బ్రహ్మాన్వవిన్దత్।

౧౨॥ ఇతి। బ్రహ్మ- ప్రజాపతిః- దేవానాం- ఇంద్రాదీనాం- హృదయం- హృదయస్థితం- పరమాత్మానం- అన్వవిందత్ । అన్విష్యలబ్ధవాన్। కీదృశం- తంతుం- పరేణ- అవిచ్ఛిన్నస్య యజ్ఞస్య- పరస్తాత్ - ఫలదశాయాం- పరిషిచ్యమానం- వృష్టిరూపేణ- వసితః- సిచ్యమానం - అంతరాదిత్యే - ఆదిత్యమండలమధ్యే - మనసా - సంకల్పమాత్రేణ- చరంతం॥

ప్రతిపదార్థం.

టీక॥ తంతుఃపరేణ=యజ్ఞమునుజేసినపిమ్మట,।పరిషిచ్యమానం=అంతటను వర్షించుచున్నటువంటిస్నీ, అంతరాదిత్యే=ఆదిత్యమండలమధ్యను, మనసా=సంకల్పముచేతనే, చరంతం=సంచరించుచున్నటువంటి, దేవానాం=దేవతులయొక్క, హృదయం=హృదయమందున్నటువంటిపరమాత్మను, బ్రహ్మ=ప్రజాపతి, అన్వవిందత్=తెలిసికొనెను.

తా॥ ఇప్పుడు రెండవబుక్కును జెప్పుచున్నాడు. దేవతులు మొదలగు సమస్తజంతుజాలములయొక్క హృదయమందు వ్యాపించియున్నట్టియు, అవిచ్ఛిన్నముగా యజ్ఞములను జేయుటచే నందువ ఫలరూపముగా నంతటను వర్షింపఁజేయుచున్నట్టియు, సంకల్పమాత్రమున నే సూర్యమండలమునందు చరించుచున్నట్టియు, అనఁగా సూర్యమండలము మొదలు సమస్తప్రదేశములయందును మనస్సంకల్పమాత్రమువల్లనే వ్యాపించియున్నట్టి, పరమాత్మస్వరూపమును చతుర్ముఖబ్రహ్మజ్ఞానముచే విచారించి తెలిసికొనెను.

అథ త్రయోదశ మంత్రమాహ.

(౧౩) బ్రహ్మైతద్బ్రహ్మణ ఉజ్జభార। అర్కగ్గ్ శ్చోతన్తగ్ం సరిరస్యమధ్యే॥ ౧౩॥

అథ భాష్యమ్.

అథ తృతీయమాహ॥ ౧౩॥ బ్రహ్మైతద్బ్రహ్మణః— సరిరస్య మధ్యే॥ ౧౩॥ ఇతి బ్రహ్మ- చతుర్ముఖః ప్రజాపతిః- బ్రహ్మణః- వేదస్య సకాశాత్- ఏతత్- సప్తహోతృస్వరూపం- ఉజ్జభార - సారత్వేనోద్ధృతవాన్- కీదృశం- అర్కం- సూర్యరూపేణావస్థితం - సరిరస్య మేఘస్థజలస్య- మధ్యే- రశ్మిద్వారా ప్రవిశ్య- శ్చోతంతం-వర్షయంతం॥

## ప్రతిపదార్థం.

టీక॥ అర్కం=సూర్యరూపముగానున్నట్టియు, సరిరస్య=జలముయొక్క, మధ్యే=మధ్యయందు, ప్రవేశించి, శ్రోతంతం=వర్షించుచున్నట్టి, ఏతత్ = ఈసప్తహోతృస్వరూపమును, బ్రహ్మ=చతుర్ముఖప్రజాపతి, బ్రహ్మణః=వేదమువలన, ఉజ్జభార=ప్రకటింపజేసెను.

తా॥ ఇప్పుడు కూడవబుక్కును జెప్పుచున్నాడు. సూర్యస్వరూపముగానున్నట్టియు నందువల్లనే కిరణములచే నావిరిరూపముగా జలమును గ్రహించి మేఘరూపముజేసి యామేఘజలములయందడి వర్షించుచున్నట్టి పరమాత్మస్వరూపమును చతుర్ముఖప్రజాపతి సమస్తవేదములను పరిశీలనజేసిన సప్తహోతృస్వరూపమునే సారమైనదానిగాను నిశ్చయించుకొనెను.

## అథ చతుర్దశ మంత్రమాహ.

(౧౪) ఆయస్మిన్ సప్తపేరవః। మేహన్తి బహులాగ్ శ్రియం। బహ్వాశ్వా మిన్ద్రగోమతీం॥ ౧౪॥

## అథ భాష్యమ్.

అథ చతుర్థీమాహ॥ ౧౪॥ ఆయస్మిన్—— మిన్ద్రగోమతీం॥౧౪॥ ఇతి। యస్మిన్- సప్తహోతృరూప ఆదిత్యే- పేరవః- వృష్టిప్రదానేన- లోకస్య- పాతారః- సప్తసంఖ్యాకారశ్మయః- ప్రాపితాః - రశ్మిసప్తకఞ్చ- సాకఞ్జానాగ్ం- సప్తథమాహురేకజమిత్యత్ర ప్రపఞ్చితం। తేచ- సప్తరశ్మయో- బహులాం- శ్రియం- ప్రభూతాం- ధనాదిసంపదం- మేహన్తి- వృష్టిసేచనద్వారేణ- సంపాదయన్తి- హేఇన్ద్ర- సప్తహోతృదేవరూప పరమేశ్వర- బహ్వాశ్వాం- బహుభిరశ్వైరుపేతాం-గోమతీం- బహుభిర్గోభిరుపేతాం- తాం- శ్రియం- ప్రయచ్ఛేతి శేషః।

## ప్రతిపదార్థం.

టీక॥ యస్మిన్ = ఏసప్తహోతృరూపమైన సూర్యునియందు, పేరవః=వృష్టిరూపముగా పడునట్టి, సప్త=ఏడుకిరణములు, ప్రాపితాః=పొందింపబడినవో, తే=ఆకిరణములు, బహులాం=విశేషమగు, శ్రియం=సంపత్తును, మేహన్తి=కలిగించుచున్నవో, ఇంద్ర=ఓపర

మేశ్వరా, బహ్వశ్వాం=విశేషగుఱ్ఱములు కలదియు, గోమతీం=అనేకగోవులుకలదియునగు, శ్రియం=సంపత్తును, ప్రయచ్ఛ=ఇమ్ము.

తా॥ ఇప్పుడు నాల్గవబుఋక్కును జెప్పుచున్నాడు. సప్తహోతృస్వరూపమగు నేసూర్యునియందు లోకమునందు వర్షింపజేయునట్టి యేడుకిరణములేవికలవో ఆయేడుకిరణములు, భూమిలో వర్షించుటచేత ధనము రత్నములు ధాన్యము మొదలగు సంపత్తును కలిగించుచున్నవి. సప్తహోతృదేవస్వరూపమగు నోపరమాత్మ విశేషగుఱ్ఱములు ఏనుగులు రథములు గోవులు మొదలగువానితోగూడిన నధికమైన సంపత్తును మాకునొసంగవలయును.

అథ పంచదశ మంత్రమాహ.

(౧౫) అచ్యుతాం బహులాం శ్రియం। సహరిర్వసువిత్తమః।
పేరురిన్ద్రాయపిన్వతే॥ ౧౫॥

అథ భాష్యమ్.

అథ పంచమీమాహ॥ ౧౫॥ అచ్యుతాం—— పేరురింద్రాయపిన్వతే॥ ౧౫॥ ఇతి। సః- దేవః- సప్తహోత్రాఖ్యః- ఇంద్రాయ- కర్మస్వామినే- యజమానాయ- శ్రియం- పిన్వతే- సించతి- ప్రయచ్ఛతీత్యర్థః- కీదృశస్సదేవః- హరిః- పాపహరణశీలః- వసువిత్తమః- అతిశయేన ధనస్యలబ్ధా- పేరుః- పాలకః- కీదృశీం- శ్రియం-అచ్యుతాం-వినాశరహితాం- బహులాం- గవాశ్వాదిభిః- ప్రభూతాం।

ప్రతిపదార్థం.

టీక॥ హరిః=పాపమునుపోగొట్టువాడును, వసువిత్తమః =విశేషధనసంపన్నుడును, పేరుః=పాలించువాడునగు, సః=ఆసప్తహోతృదేవత, అచ్యుతాం=నశించనదియు, బహులాం= విశేషమగు, శ్రియం = సంపత్తును, ఇంద్రాయ = యజమానునికొఱకు, పిన్వతే= ఇచ్చుచున్నాడు.

తా॥ అయిదవబుఋక్కునుగురించి చెప్పుచున్నాడు సేవించువారిపాపములను పోగొట్టువాడును విశేషధనసంపన్నుడును భక్తులను పాలించువాడునగు సప్తహోతృస్వరూపుడైన దేవుడు కర్మలనుజేయునట్టి యజమానునికెప్పుడు నశించక స్థిరముగా నుండునట్టి అశ్వములు గుఱ్ఱములు ధనము ధాన్యము మొదలగు విశేషసంపత్తును ఇచ్చుచుండును.

అథ షోడశమన్త్రమాహ.

(౧౬) బహ్వాశ్వామిన్ద్రగోమతీం। అచ్యుతాంబహులాగ్ శ్రియం। మహ్యామిన్ద్రోనియచ్ఛతు॥ ౧౬॥

అథ భాష్యమ్.

అథ షోడశమాహ॥ ౧౬॥ బహ్వాశ్వామిన్ద్రగోమతీం—నియచ్ఛతు॥ ౧౬॥ ఇతి॥ ఇంద్రః - పరమైశ్వర్యయుక్త సప్తహోతృదేవః- స్పష్టమన్యత్॥

ప్రతిపదార్థం.

టీక॥ బహ్వాశ్వాం = విశేషగుఱ్ఱములుకలదియు, గోమతీం = గోవులుకలదియు, అచ్యుతాం=నశించనదియు, బహులాం=విశేషమగు, శ్రియం=సంపత్తును, ఇంద్రః=సప్తహోతృదేవత, మహ్యాం=నాకొరకు, నియచ్ఛతు=ఇచ్చుగాక.

తా॥ విశేష గుఱ్ఱములు ఏనుగులు గోవులు ధనము ధాన్యము మొదలగునవియు నెప్పుడు నశింపకుండునట్టి విశేషసంపత్తును పరమైశ్వర్య సంపన్నుడగు సప్తహోతృదేవత నాకు నిచ్చుచుండవలయును.

అథ సప్తదశమన్త్రమాహ

(౧౭) శతగ్ంశతా అస్యయుక్తాహారీణాం। అర్వాఙ్ఞాయాతు వసుభీరశ్మిరిన్ద్రః। ప్రమగ్ంహమానో బహులాగ్ శ్రియం। రశ్మిరింద్రస్సవితామేనియచ్ఛతు॥ ౧౭॥

అథ భాష్యమ్.

అథ సప్తమీమాహ॥ ౧౭॥ శతగ్ంశతా— నియచ్ఛతు ఇతి॥ ౧౭॥ అస్య- ఆదిత్యరూపస్య- సప్తహోతృదేవస్య - హారీణాం - అన్ధకారహరణ శీలానాం - రశ్మీనాం - శతగ్ంశతా - శతసంఖ్యాకాని శతాని- అయుతసంఖ్యాకానీత్యర్థః- యుక్తా- యుక్తాని- సంపాదితాని- ఇంద్రః- పరమైశ్వర్యయుక్తః- రశ్మిః- బహువిధరశ్మియుక్తః- ఆదిత్యః వసుభిః- ధనైస్సహా- అర్వాఙ్ఞాయాతు- అభిముఖ్యేనాగచ్ఛతు - ఆగత్య- సవితా- బహులాం శ్రియం- ప్రభూతాం- ధనాదిసంపదం- మే-

మహ్యం- నియచ్ఛతు। నితరాందదాతు। కీదృశస్సవితా - ప్రమగ్ంహమాణః- అస్మదీయస్తుతిభిః- ప్రకర్షేణవర్ధమానః - రశ్మిః - బహువిధరశ్మియుక్తః- ఇంద్రః- పరమైశ్వర్యయుక్తః॥

## ప్రతిపదార్థం.

టీక॥ హారిణాం=అంధకారమునుపోగొట్టునట్టి కిరణములయొక్క, శతగ్ంశతా = పదివేలు, అస్య=ఈసూర్యునకు, యుక్తాః=కూడుకొనునవి, రశ్మిః=కిరణములుకలవాడును, ఇంద్రః = పరమైశ్వర్యసంపన్నుడగు సూర్యుడు, వసుభిః = ధనములతోగూడుకొని, అర్వాజ్=ఎదురుగా, ఆయాతు=వచ్చుగాక, ప్రమగ్ంహమాణః = స్తోత్రములచే వృద్ధిపొందునట్టియు, రశ్మిః=కిరణములతో గూడినట్టియు,ఇంద్రః = పరమైశ్వర్యసంపన్నుడగు, సవితా=సూర్యుడు, బహులాం = విశేషమగు, శ్రియం=సంపత్తును, మే=నాకు, నియచ్ఛతు=ఇచ్చుగాక.

తా॥ ఇఁకను ఏడవబుక్కును గురించిచెప్పుచున్నాడు. అంధకారమునుపోగొట్టునట్టి విశేషకిరణములతో సూర్యుడు నెప్పుడును ప్రకాశించుచుండును. పరమైశ్వర్యసంపన్నుడును అనేకవిధములగు కిరణములతో బ్రకాశించుచుండెడివాడును నాయొక్కస్తోత్రములచే వృద్ధినొందుచుండెడివాడునగు ఆసూర్యుడు నావద్దకువచ్చి ధనముమొదలగు విశేషసంపత్తునిచ్చుగాక

## అథాష్టాదశ మంత్రమాహ.

(౧౮) ఘృతం తేజోమధుమదిన్ద్రియం। మయ్యాయమగ్నిర్దధాతు॥ ౧౮॥

## అథ భాష్యమ్.

అథాష్టమీమాహ॥ ౧౮॥ ఘృతం తేజో— మయ్యాయమగ్నిర్దధాతు॥ ౧౮॥ ఇతి॥ అయం- సప్తహోతృదేవః - ద్రవ్యాత్మకస్సన్- మయి- యజమానే- మధుమత్ - ఘృతం- మధురసోపేతం - ఘృతాదిద్రవ్యం- తేజః- కాంతిం - ఇంద్రియం - చక్షురాది సామర్థ్యంచ- దధాతు- సంపాదయతు॥

## ప్రతిపదార్థం.

టీక॥ అయం=ఈ, అగ్నిః=అగ్నిహోతృడు, మధుమత్=మధురరసముతోగూడిన,

ఘృతం=ఆజ్యమును, తేజః=కాంతిని, ఇంద్రియం = ఇంద్రియమును, మయి = నాయందు, దధాతు=కలిగించుగాక.

తా॥ ఇప్పుడు నెనిమిదవబుక్కును జెప్పుచున్నాడు. అగ్నిహోత్రస్వరూపుడగు సప్తహోతృదేవత సమస్తద్రవ్యములతోఁ గూడినవాడై నాస్తోత్రములనువిని మధురసముతోఁగూడినట్టి ఆజ్యము మొదలగు పదార్థములను, కాంతిని, నేత్రము మొదలగు నింద్రియములకు బలమును, నాకు నెప్పుడునుకలిగించుచుండుగాక.

అథ ఏకోనవింశతి మంత్రమాహ.

(౧౯) హారిః పతంగః పటరీసుపర్ణః। దివిక్షయోనభసాయఏతి। సనఇన్ద్రః కామవరందదాతు॥ ౧౯॥

అథ భాష్యమ్.

అథ నవమీమాహ॥ ౧౯॥ హారిః పతంగః—— దదాతు॥ ౧౯॥ ఇతి। హారిః- అన్ధకారహరణశీలః- పతంగః- సూర్యరూపః- పటరీ- తేజః పటలవాన్- సుపర్ణః- పక్షిసదృశః- దివిక్షయః- స్వర్గనివాసీ- యః- సప్తహోతృదేవః- నభసా- ఆకాశమార్గేణ- ఏతి- గచ్ఛతి- సః-దేవః- నః- అస్మాకం కామవరం కామానామధ్యే శ్రేష్ఠం దదాతు॥

ప్రతిపదార్థం.

టీక॥ హారిః=అంధకారమునుపోఁగొట్టువాడును, పతంగః = సూర్యస్వరూపుడును, పటరీ=కాంతిసమూహముతోఁ గూడినవాడును, సుపర్ణః=పక్షితోఁ సమానుడును, దివిక్షయః= స్వర్గములోఁ నివసించువాడునగు, యః=ఏదేవుడు, నభసా=ఆకాశమార్గముచేత, ఏతి= వెళ్లుచున్నాడో, సః=ఆసప్తహోతృస్వరూపుడగు దేవుడు, నః=మాయొక్క, కామవరం=కోరినట్టివరములను, దదాతు=ఇచ్చుగాక.

తా॥ తొమ్మిదవబుక్కును జెప్పుచున్నాడు. గాఢాంధకారమును పోఁగొట్టునట్టివాడును, సూర్యస్వరూపుడైనవాడుగనుక నే కాంతితోఁ ప్రకాశించువాడును, స్వర్గలోకమునందు నివసించువాడును, పక్షివలెనే యాకాశమార్గమునందు సంచరించునట్టి సప్తహోతృస్వరూపుడగు దేవుడు. మేముకోరినట్టి శ్రేష్ఠములైనవరములను మాకునొసంగుగాక.

అథ వింశతిమంత్రమాహ.

(౨౦) పఞ్చారంచక్రం పరివర్తతేపృథు। హిరణ్యజ్యోతిస్సరిరస్య మధ్యే। అజస్రం జ్యోతిర్నభసా సర్పదేతి। సనఇన్ద్రః కామవరం దదాతు॥

## అథ భాష్యమ్.

అథ దశమీమాహ॥ ౨౦॥ పంచారంచక్రం— కామవరం దదాతు॥ ౨౦॥ ఇతి। ఋతుపంచాత్మకా ఆరా- యస్య- కాలచక్రస్య తత్- పంచారం- పృథు- విస్తృతం - చక్రం - సంవత్సరాత్మకం- కాలచక్రం- పరివర్తతే- పరితః- ప్రవర్తతే- సరిరస్యమధ్యే-మేఘవర్తి జలస్యమధ్యే- హిరణ్యజ్యోతిః- రశ్మిసంచారేణ- విద్యుద్రూపపరిణామేనతి- సువర్ణసమానం- జ్యోతిర్యస్య మండలస్య తద్ధిరణ్యజ్యోతిః- తాదృశం- జ్యోతిః - ఆదిత్యమండలం - సంవత్సరచక్ర నిష్పాదకం- అజస్రం నిరంతరం- నభసా- ఆకాశమార్గేణ- సర్పదేతి- శనైస్సంచరతి- గచ్ఛతి- సః- జ్యోతిర్మండలాత్మా - నః- అస్మాకం - కామవరం దదాతు॥

## ప్రతిపదార్థం.

టీక॥ పంచారం=అయిదుఅంచులుగల, పృథు=విస్తారమగు, చక్రం=చక్రము, పరివర్తతే=అంతటను తిరుగుచున్నది, సంరస్య=మేఘములోనుండు జలముయొక్క, మధ్యే=మధ్యయందు, హిరణ్యజ్యోతిః=సువర్ణముతో సమానమగు తేజస్సుగల, జ్యోతిః=సూర్యాత్మకమగు యే తేజస్సు, నభసా=ఆకాశమార్గముచేత, సర్పత్=మెల్లగానడచుచు, ఏతి=వెళ్ళుచున్నదో, ఇంద్రః=పరమైశ్వర్యయుక్తుడగు, సః= అట్టితేజస్సు నః= మాయొక్క, కామవరం=కోరినట్టివరములను, దదాతు=ఇచ్చుగాక.

తా॥ పదియవఋక్కును జెప్పుచున్నాడు. అయిదుఋతువులనెడు అంచులుగల సంవత్సరాత్మకమయిన విశేషమగు కాలచక్రమెప్పుడును తిరుగుచుండును. మేఘజలముల యందు కిరణములువ్యాపించుటచే మెరుపుగాపరిణమించుటచేత బంగారముతో సమానమైన కాంతిగలదియు, సూర్యమండలస్వరూపమగు సంవత్సరాత్మమగు ఆకాలచక్రము నిరంతరము ఆకాశమార్గమున తిరుగుచుండును. తేజస్స్వరూపుడగువాడును పరమైశ్వర్యసంపన్నుడును కాలచక్రస్వరూపుడునగు ఆసూర్యదేవత మేముకోరినవరములనిచ్చుగాక.

## అథ ఏకవింశతి మంత్రమాహ.

(౨౧) సప్తయుఞ్జన్తి రథమేకచక్రం । ఏకోఅశ్వోవహతి సప్తనామా। త్రినాభిచక్రమజరమనర్వం। యేనేమావిశ్వాభువనానితస్థుః॥ ౨౧

## అథ భాష్యమ్.

అథ ఏకాదశీమాహ॥ ౨౧॥ సప్తయుంజతి— భువనానితస్థుః॥ ౨౧॥ ఇతి సప్తసంఖ్యాకాస్సాకం జానామిత్యత్రోక్తాః ముఖ్యరశ్మివిశేషాః- అశ్వసదృశాః- ఏకచక్రం- ఏకప్రకారపరివర్తమానం కాలచక్రం- యుంజంతి- ప్రవర్తయంతి- తదేవస్పష్టీక్రియతే- సప్తనామా సప్తసంఖ్యాకానినామాని- నమనయోగ్యాని- వశ్యాని- రశ్మిరూపాణి- యస్యాసౌ- సప్తనామా- అశ్వః- వ్యాపకః- ఏకః సూర్యః- తత్కాల
* చక్రం- వహతి- కీదృశం- చక్రం- త్రినాభి - త్రిస్సత్వరజస్తమో గుణరూపాః - భూతభవిష్యద్వర్తమానరూపావా - నాభయోయస్య తత్త్రినాభి- అజరం- వినాశరహితం- నహికాలస్సంసారమధ్యేకదాచిద్వినశ్యతి- అనర్వం- అర్వావిరోధీ- వినాశకో- భ్రాతృవ్యోవాఅర్వేతి శ్రుతేః- తద్రహితం। నహికాలచక్రస్య కశ్చిన్నాశకోస్తి - యేనకాలచక్రేణ- ఇమాని విశ్వాభువనాని। దృశ్యమానాని సర్వాణి భూతజాతాని। తస్థుః। తిష్ఠంతి। సుఖేనవర్తంతే। తస్యకాలచక్రస్య నిర్వాహకోయం సప్తహోతృదేవః। ఆదిత్యఇత్యర్థః॥

## ప్రతిపదార్థం.

టీక॥ సప్త=ఏడుకిరణములు, ఏకచక్రం = ఏకవిధముగాతిరుగునట్టి కాలచక్రస్వరూపమగు, రథం=రథమును, యుంజంతి=ప్రవర్తింపజేయుచున్నవి, అశ్వః=వ్యాపించియున్నవాడును, సప్తనామా=స్వాధీనమగు నేడుకిరణములుకలవాడును, ఏకః = ఒక్కడైన సూర్యుడు, త్రినాభి=మూడునాభులుకలిగినట్టియు, అజరం = నాశనములేనట్టియు, అనర్వం=విరోధిలేనట్టియు, చక్రం=కాలచక్రమును, వహతి = వహించుచున్నాడు, యేన = ఏకాలచక్రముచే, ఇమా=ఈ, విశ్వా = సమస్తమైన, భువనాని = లోకములు, తస్థుః= ఉండినవో.

తా॥ పదకొండవఋక్కునుగురించి చెప్పుచున్నాడు. అశ్వముతో సమానమగునట్టి ముఖ్యమైన యేడుకిరణములు ఏకవిధముగాతిరుగునట్టి కాలచక్రమును ప్రవర్తింపజేయుచున్నవి. సర్వవ్యాపకుడైన సూర్యుడు ఆయేడుకిరణములను స్వాధీనముగానుంచుకొనినవాడై సత్వరజస్తమోగుణరూపముగాగాని భూతభవిష్యద్వర్తమానరూపముగాగాని యున్నట్టి మూడు బండికండ్లుకలిగినట్టియు, నాశనములేనట్టియు నెవనివల్లను నశింపజేయ

బడసట్టియు కాలచక్రమునువహించి తిథి మాస సంవత్సరాత్మకమగు కాలమును జరుపుచుండును. ఆకాలచక్రముచేతనే యీసమస్త భువనములున్నూ సుఖముగా నిలిచియున్నవి. అట్టికాలచక్రమును నిర్వహించువాడు సప్తహోతృదేవతాస్వరూపుడగు యీసూర్యుడేయని చెప్పిరి.

## అథ ద్వావింశతి మంత్రమాహ.

(౨౨) భద్రంపశ్యంత ఉపసేదురగ్రే। తపోదీక్షామృషయస్సువర్విదః। తతఃక్షత్రంబలమోజశ్చజాతం। తదస్మైదేవా అభిసన్నమన్తు॥

## అథ భాష్యమ్.

అథ ద్వాదశీమాహ॥ ౨౨॥ భద్రంపశ్యంతే—అభిసన్నమంతు॥ ౨౨॥ ఇతి। సువర్విదః। స్వర్గమార్గాభిజ్ఞాః। ఋషయః। భద్రం। కల్యాణం। సప్తహోతృరూపమాదిత్యం। పశ్యంతః। ప్రాప్యత్వేన నిశ్చిన్వానాః। తపః। అనశనాదిరూపం। దీక్షాం। నియమవిశేషంచ। ఉపసేదుః। అనుష్ఠితవంతః। తతః। ఆదిత్యసకాశాత్। క్షత్రం। క్షతాత్ త్రాణం। అనిష్టనివారణం। బలం। శరీరశక్తిః। ఓజః। కాంతిః। ఇత్యేతత్సర్వం। జాతం। సంపన్నం। తత్। చ। క్షత్రాదిత్రయం। అస్మై। యజమానాయ। దేవాః। అభిసంనమంతు। అభితస్సంపాదయంతు॥

## ప్రతిపదార్థం.

టీక॥ సువర్విదః=స్వర్గమునపేక్షించినవారై, ఋషయః=మునీశ్వరులు, భద్రం=శుభమునొసగునట్టి సూర్యుని పశ్యంతః=నిశ్చయించినవారగుచు, అగ్రే=ముందరను, తపః=తపస్సును, దీక్షాం=దీక్షను, ఉపసేదుః=అనుష్ఠించిరి, తతః=ఆసూర్యునివల్లను, క్షత్రం=అనిష్టమునుపోగొట్టుశక్తియు, బలం=శరీరబలము, ఓజః=కాంతియు, జాతం=సంభవించెను, తత్=ఆమూడుగుణములను, దేవాః=దేవతులు, అస్మై=ఈయజమానునికొరకు, అభిసంనమంతు=ఇత్తురు గాక.

తా॥ పండ్రెండవఋక్కునుగురించి చెప్పుచున్నాము. స్వర్గమార్గమును తెలిసిన మునీశ్వరులు శుభములను బడయుటకు సప్తహోతృస్వరూపుడగు సూర్యునికళకను గానిశ్చయించినవారై యుపవాసరూపమగు తపస్సును ఇంద్రియనిగ్రహ ఆచారము మొదలగు దీక్షనుముందు గావహించినవారై యాసూర్యుని సేవించి యాతనివలన ననిష్టములను పో

గొట్టునట్టిశక్తియు శరీరబలమును, దేహకాంతియు నొందిరి. కాబట్టియా సూర్యాదిదేవతలును ఈయజమానునకు దేహబలము శరీరకాంతి అనిష్టములు పోగొట్టునట్టి శక్తియు నిత్తురుగాక.

అథ త్రియోవింశతి మంత్రమాహ.

(౨౩) శ్వేతగ్ంరశ్మిం బోభుజ్యమానం। అపాంనేతారంభువనస్యగోపాం। ఇంద్రంనిచిక్యుః పరమేవ్యోమన్॥ ౨౩॥

అథ భాష్యమ్.

అథ త్రయోదశీమాహ॥ ౨౩॥ శ్వేతగ్ంరశ్మిం— పరమేవ్యోమన్॥ ౨౩॥ ఇతి। పరమేవ్యోమన్ - ఉత్కృష్టే హృదయాకాశే- ఇంద్రం- పరమైశ్వర్యయుక్తం- సప్తహోతృదేవమాదిత్యం- నిశ్చిక్యుః నిశ్చితవంతః- ధ్యాతవంతఇత్యర్థః। కీదృశమింద్రం- శ్వేతం- ప్రకాశరూపత్వేన శుక్లవర్ణం- రశ్మిం- రశ్మియుక్తం- బోభుజ్యమానం- సర్వైః ప్రాణిభిః- వృష్టిద్వారేణపునః పునర్భుజ్యమానం- ఏతదేవస్పష్టీక్రియతే- అపాంనేతారం- ఆదిత్యాజ్జాయతే వృష్టిరితిస్మృత్యా సూర్యోజలస్యనేతా- తాదృశం- భువనస్యగోపాం- భువనస్యపాలకం॥

ప్రతిపదార్థం.

టీక॥ శ్వేతం= తెల్లనివర్ణముకలిగినట్టియు, రశ్మిం = కిరణములుకలిగినట్టియు బోభుజ్యమానం= అందరిచేత ననుభవింప బడుచున్నట్టియు, అపాంనేతారం = ఉదకములకు నధిపతియైనట్టియు, భువనస్య= ప్రపంచమునకు, గోపాం= పాలకుడగునట్టియు, ఇంద్రం= పరమైశ్వర్యయుక్తుడగు సప్తహోతృ స్వరూపుడగు సూర్యుని, పరమేవ్యోమన్= అధికమగు హృదయాకాశమునందు, నిచ్చిక్యు= నిశ్చయించి ధ్యానించిరి.

తా॥ పదమూడవ ఋక్కును గురించి చెప్పుచున్నాడు. తెల్లగా కాంతిచేత ప్రకాశించువాడును, కిరణములతో గూడియున్నవాడును, సూర్యుని వలన వర్షము కలుగుచున్నదని చెప్పుటచేత సమస్త ప్రాణులచేత వర్షరూపముగా ననుభవింపబడుచున్నవాడును, అందువల్లనే జలములకు నధిపతియైనవాడును, సమస్త ప్రపంచమును రక్షించువాడును, పరమైశ్వర్యసంపన్నుడును, హోతృస్వరూపుడగు సూర్యుని పరమాకాశమని చెప్పబడు హృదయాకాశమునందు నుండునట్లుగా నిశ్చయించి మునీశ్వరులు ధ్యానించిరి.

అథ చతుర్వింశతి మంత్రమాహ.

(౨౪) రోహిణీఃపిఙ్గలాఏకరూపాః। క్షరంతీఃపిఙ్గలాఃఏకరూపాః। శతగ్ంసహస్రాణి ప్రయుతానినావ్యానాం॥ ౨౪)

అథ భాష్యమ్.

అథ చతుర్దశీమాహ॥౨౪॥ రోహిణీః—నావ్యానాం॥ ౨౪॥ఇతి। రోహిణీః రోహిణవర్ణాః - పింగలాః- పింగలవర్ణాశ్చ- యాఆప స్తత్తద్భూమి సంబంధేన బహువిధాదృశ్యంతే। తాస్సర్వాఅపి సప్తహోతృరూపస్య ఆదిత్యస్య రశ్మిసంబంధేసతి- మేఘేషు - నానారూపత్వ పరివ్యంజక రూపాః- భవంతి- తథా- క్షరంతీః- వృష్టిరూపేణ- భూమా - పతంత్యస్తాః పింగళాదివర్ణా ఆపః- ఏకరూపాః భవంతి। వృష్టిబాహుళ్యేన భూమా- నావ్యానాం- నావాతరణీయానాం- అపాం- శతం- సహస్రాణి- ప్రయుతాని- శతసంఖ్యాబహువిధ సహస్రలక్షసంఖ్యాకాశ్చ సంపద్యంతే। వృష్టికాలే తత్ర తత్రానేక ప్రవాహాభవంతి। తదేతత్సర్వం- సప్తహోతృమాహాత్మ్యం॥

ప్రతిపదార్థం.

టీక. రోహిణీః= ఎఱ్ఱనివర్ణము కలిగినట్టియు, పింగలాః= పచ్చని వర్ణము కలిగినట్టియు, ఆపః= ఉదకములు, ఏకరూపాః= ఒకరూపము కలవియేయగును, క్షరంతీః= వర్షించినట్టి, పింగలాః= పింగళాదివర్ణములుగల ఆయుదకము లన్నియు, ఏకరూపాః= ఒకేరూపముకలవి, నావ్యానాం= నావలచే దాటతగిన జలములయొక్క, శతం= నూర్లు, సహస్రాణి= వేలు, ప్రయుతాని= పదివేలు ప్రవాహములు కలవు.

తా॥ పదునాల్గవ ఋక్కును జెప్పుచున్నాడు భూమియందు పడుటచే నాయా భూములయందుగల యెఱ్ఱని పచ్చని మొదలగు రంగులచే నాయావర్ణములుగా ప్రకాశించెడి జలములన్నియు మేఘములో నున్నప్పుడును సప్తహోతృస్వరూపుడగు సూర్యుని యొక్క కిరణములు సోకుటచేత ననేకరంగులు కలవిగాను కనబడుచున్నవి. అట్టియనేక రంగులుగా నుండునట్టి జలములు వర్షరూపముగా భూమియందు పడినవియై యేకవిధము గానేయున్నవి. భూమియందు విశేషముగా వర్షము కురియుటచే చిన్నచిన్న ప్రవాహములుగాను మఱియు నోడలచేత దాట తగిన ననేక పెద్దప్రవాహములుగాను సంభవించుచున్నవి. ఇది యంతయును సప్తహోతృని మాహాత్మ్యము.

అథ పంచవింశతి మంత్రమాహ.

(౨౫) అయంయః శ్వేతోరశ్మిః। పరిసర్వమిదంజగత్। ప్రజాం పశూన్ ధనాని। అస్మాకందదాతు॥ ౨౫॥

## అథ భాష్యమ్.

అథ పంచదశీమాహ॥ ౨౫॥ అయంయః—— అస్మాకందదాతు॥ ౨౫॥ ఇతి। యః- ఆదిత్యః- శ్వేతవర్ణో- రశ్మియుక్తోస్తి- సోయం-సర్వమిదం- జగత్- పరి- వ్యాప్య - వర్తమానః - అస్మాకం - ప్రజాదికం- దదాతు॥

## ప్ర తి ప దా ర్థ ం.

టీక. శ్వేతః = తెల్లనికాంతి కలిగినట్టియు, రశ్మిః = కిరణములతో గూడినట్టి, యః= ఏసూర్యుఁడు, సర్వం= సమస్తముగు, ఇదం= ఈ, జగత్= ప్రపంచమును, పరి= వ్యాపించియుండెనో, అయం= ఈసూర్యుడు, అస్మాకం = మాకు, ప్రజాం = సంతానమును, పశూన్= పశువులను, ధనాని= ధనములను, దదాతు= ఇచ్చుగాక.

తా॥ పదియేనవ ఋక్కును గురించి చెప్పుచున్నాఁడు. తెల్లని వర్ణముగల కిరణములతో గూడి యీప్రపంచమునంతయు వ్యాపించి ప్రకాశించుచున్నట్టి సూర్యుఁడు సంతానమును పశువులను ధనములను మొదలగు వానిని మాకు నొసఁగుగాక.

## అథ షడ్వింశతి మంత్రమాహ.

(౨౬) శ్వేతోరశ్మిః పరిసర్వం బభూవ। సువన్మహ్యాం పశూన్ విశ్వరూపాన్॥

## అథ భాష్యమ్.

అథ షోడశీమాహ॥ ౨౬॥ శ్వేతో—— విశ్వరూపాన్॥౨౬॥ ఇతి। శ్వేతోరశ్మిః- శుక్లవర్ణరశ్మియుక్తః- ఆదిత్యః - సర్వం - జగత్ - పరి బభూవ- పరితోవ్యాప్తవాన్- తాదృశః- ఆదిత్యః - మహ్యాం - విశ్వరూపాన్- గోమహిష్యాదిరూపేణ- బహువిధాన్- పశూన్- సువత్- సౌతు- ప్రేరయత్విత్యర్థః॥

## ప్ర తి ప దా ర్థ ం.

టీక. శ్వేతోరశ్మిః= తెల్లనికాంతిగల కిరణములతో గూడినట్టి, యః=ఏసూర్యుడు కలడో, సః= ఆసూర్యుఁడు, సర్వం= సమస్తముగు ప్రపంచమును, పరిబభూవ=వ్యాపించియుండెను, విశ్వరూపాన్ = అనేక విధములగు, పశూన్ = పశువులను, మహ్యాం= నాకొరకు, సువత్ = ఇచ్చుగాక.

తా॥ పదియారవ ఋక్కును గురించి చెప్పుచున్నాఁడు. తెల్లనికాంతిగల కిరణములతోఁగూడికొని యీప్రపంచము నంతయు వ్యాపించి ప్రకాశించుచున్నట్టి సూర్యుఁడు ఏనుగులు గుఱ్ఱములు గోవులు ఒంటెలు మొదలగు ననేక విధములగు పశ్వాదిధనములను మాకు నొసంగుచుండుగాక.

అథ సప్తవింశతి మంత్రమాహ.

(౨౭) పతఙ్గమక్తమసురస్యమాయయా। హృదాపశ్యన్తిమనసా మనీషిణః। సముద్రే అన్తః కవయోవిచక్షతే। మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః॥ ౨౭॥

అథ భాష్యమ్.

అథ సప్తదశీమాహ॥ ౨౭॥ పతంగమక్తం—— వేధసః॥ ఇతి॥ ౨౭॥ అసూన్- ప్రాణాన్- రాతిదదాతీతి - అసురః - పరమాత్మా- తస్య- మాయయా- అచిన్త్యశక్త్యా- అక్తం- అభివ్యక్తం- పతంగం- ఆదిత్యం- హృదా- మనసా- హృత్పుండరీకగతేన- నియమితేనాంతః కరణేన- మనీషిణః- వేదశాస్త్రాభిజ్ఞాః- మహర్షయః- పశ్యంతి- ధ్యాత్వా సాక్షాత్కుర్వంతి। కవయః - లౌకికవార్తాభిజ్ఞాః - పురుషాః - సముద్రే అంతః- సముద్రసమానే అంతరిక్షమధ్యే - విచక్షతే- విశేషేణ కథయంతి। అయమాదిత్యః - ఉదితః - మధ్యాహ్నేసమాగతః ఇత్యాదివ్యవహారంకుర్వంతి- వేధసః- విధాతారో అనుష్ఠానకుశలాః- కేచిద్యజమానాః- మరీచీనాం- పదం- రశ్మీనాంపదం- స్థానం - ఆదిత్యం- ఇచ్ఛంతి- ఆదిత్యసాయుజ్య ప్రాప్త్యర్థమనుతిష్ఠంతీత్యర్థః॥

ప్రతిపదార్థం.

టీక. అసురస్య= పరమాత్మయొక్క, మాయయా= మాయచేత, అక్తం= ప్రకటముగానున్నట్టి, పతంగం= సూర్యుని, మనీషిణః= విద్వాంసులు, హృదా= హృదయపద్మమునందు, మనసా= మనస్సుచేత, పశ్యంతి = చూచుచున్నారు, కవయః = ఇతరులైన కవీశ్వరులు, సముద్రేఅంతః= ఆకాశమధ్యయందు, విచక్షతే= చెప్పుచున్నారు, వేధసః= నిపుణులగు యజమానులు, మరీచీనాంపదం = కిరణములగు స్థానభూతుడగు సూర్యుని, ఇచ్ఛంతి= కోరుచున్నారు.

తా॥ పదియేడవ యర్థమును గురించి చెప్పుచున్నాడు. అసువులు అనఁగా ప్రాణములు వాటిని రాతి ఇచ్చువాడు కాఁబట్టి అసుర శబ్దమునకు పరమాత్మయని యర్థము ఇచ్చట చెప్పఁబడినది. అట్టి పరమాత్మయొక్క అనిర్వచనీయమైన మాయవలన ఈసూర్యుడు ప్రకటీభూతుడై ప్రకాశించుచున్నాడు. అట్టి పరమాత్మ స్వరూపుడగు సూర్యుని వేద శాస్త్రములను తెలిసిన విద్వాంసులుగాని మునీశ్వరులుగాని తమహృదయ పద్మమునందు నింద్రియములను నిగ్రహించి నిశ్చలమగు మనస్సుతో ధ్యానించి ప్రత్యక్షమును జేసికొనుచున్నారు. ఇతరమగు సామాన్యముగా పండితులమని చెప్పుకొనెడి కవీశ్వరులుసముద్రము వలెనే యపారమైన యీయాకాశమునం దుదయించు చున్నాడనియు మధ్యాహ్నసమయమునకు నాకాశములో నూర్ధ్వప్రదేశమందుండెననియు సాయంకాలమందు నస్తమించెననియు నీప్రకారంబున ననేక విధములుగా జెప్పుకొనుచు వ్యవహరింతురు. మఱియు యమనియమాద్య నుష్ఠానపరులగు యజమానులు సహస్రకిరణములతో బ్రకాశించుచుండెడి సూర్యుని ధ్యానించి సూర్యసాయుజ్యము నిమిత్తము యత్నింతురు.

అథ అష్టావింశతి మంత్రమాహ.

(౨౮) పతంగోవాచం మనసాబిభర్తి। తాంగంధర్వో వదద్గర్భేఅన్తః। తాంద్యోతమానాగ్ స్వర్యం మనీషాం। ఋతస్యపదే కవయోనిపాంతి॥ ౨౮॥

## అథ భాష్యమ్.

అథాష్టాదశమాహ॥ ౨౮॥ పతంగోవాచం—నిపాంతి॥ ఇతి॥ ౨౮॥ పతంగః- ఆదిత్యః- మనసా- స్వకీయేన- ప్రాణినాం - వాచం- బిభర్తి- ధారయతి - అంతర్యామిరూపేణవాచం - ప్రేరయతీత్యర్థః। తథాచపౌరాణికా ఆహుః- యోంతః ప్రవిశ్యమమవాచమిమాం ప్రసుప్తాం సంజీవయత్యఖిలశక్తి ధరస్స్వధామ్నేతి। తాం- ఆదిత్యప్రేరితాం వాచం- గర్భే అంతః- శరీరస్యమధ్యే - గంధర్వనామకోవాయురవదదుచ్చారయతి। గంధాన్వహతీతి వ్యుత్పత్త్యాగంధర్వశబ్దోవాయు మాచష్టే। వాయుర్జిహ్వా- తాల్వాదిస్థానేషు సంయుక్తోవాచ ముచ్చారయతి- తాం। వాయునోచ్చారితాం। ద్యోతమానాం। ప్రకాశమానాం। స్వర్యం స్వర్గస్య హేతుభూతాం। మనీషాం। మనసః। ఈశిత్రీం। ఆహ్లాదకరీమిత్యర్థః। తాదృశీం। వాచం। కవయః। శాస్త్రాభిజ్ఞాః ఋతస్యపదే। సత్యస్య

పరబ్రహ్మణః। స్థానే। నిషాంతి। నితరాం పాలయంతి । పరబ్రహ్మవిష యాణి। వేదవాక్యాని। సర్వదాపఠంతీత్యర్థః। తదేతత్సర్వం। వాచః ప్రేరకస్యాదిత్యస్య। మాహాత్మ్యం॥

ప్రతిపదార్థం.

టీక. పతంగః= సూర్యుఁడు, వాచం=వాక్కును, మనసా=మనస్సుచేత, బిభర్తి= భరించుచున్నాడు, తాం= ఆవాక్కును, గర్భేఅంతః=శరీరమునందున్నవాఁడై, గంధర్వః= గంధర్వుఁడనెడు వాయువు, అవదత్= పలుకుచున్నాఁడు, తాం= అటువంటిన్ని, ద్యోతమానాం= ప్రకాశించుచున్నట్టియు, స్వర్యం = స్వర్గమునకు కారణభూతమైనదియు, మనీషాం= మనస్సునకు నానందకరమగు ఆవాక్కును, కవయః = విద్వాంసులు, ఋతస్య= సత్యమగు పరమాత్మయొక్క, పదే = స్థానమునందు, నిషాంతి = ముఖ్యముగా భావించుచున్నారు.

తా॥ పదునెనిమిదవ ఋక్కును గుఱించి చెప్పుచున్నాఁడు. సూర్యుఁడుసకలప్రాణులలో నంతర్యామిగా నివసించుచు నాయాప్రాణుల మనోరూపముగా వాక్కును ప్రేరేపించుచున్నాఁడు. అనఁగా ముందుగామనస్సున సంకల్పరూపముగా వాక్కును భావింపఁజేయుచున్నాఁడు. ఇందునుగురించి పౌరాణికులు చెప్పినదేమనగా. సకలశక్తిసంపన్నుఁడగు సూర్యుఁడు శరీరమునందు నంతర్యామిగా ప్రవేశించి కారణశరీరమునందు లీనమైయుండు వాక్కును జాగ్రదవస్థలోనికి విజృంభింపజేయును, అనిచెప్పిరి. ఇట్లుసూర్యునిచే ప్రేరేపింపబడిన వాక్కును గంధర్వుఁడను వాయువు శరీరమునుండి తాలువులు మొదలగు స్థానములయందు ప్రవేశించి స్ఫుటముగా పలుకునట్లుచేయును. ఇట్లువాయువుచే పలికింపజేయునట్టియు, స్ఫుటముగా దోచబడునట్టియు, మనస్సునకు నానందమును కలుగజేయునట్టియు, స్వర్గమునొందుటకు సాధనభూతమగు ఆవాక్కును వేదశాస్త్రమును తెలిసిన విద్వాంసులు సత్యస్వరూపమగు పరబ్రహ్మస్థానమునందుంచిరి. అనఁగా మోక్షమునొసగునట్టియు, పరిబ్రహ్మబోధకమగునట్టి శ్రుతివాక్యములను నెప్పుడు పఠించుచుందురు. ఇది యంతయు వాక్కులను ప్రేరేపించునట్టి సూర్యునియొక్క మాహాత్మ్యమని తెలిసినపండితులు చెప్పిరి.

ఏకోనత్రింశతి మంత్రమాహ.

(౨౯) యేగ్రామ్యాః పశవోవిశ్వరూపాః । విరూపాః సన్తో

బహుధైకరూపాః। అగ్నిస్తాగ్ం అగ్రేప్రముమోక్తు దేవః। ప్రజాపతిః ప్రజయా సంవిదానః॥ ౨౯॥

అథ భాష్యమ్.

అథైకోనత్రింశమాహ॥ ౨౯॥ యేగ్రామ్యాః— సంవిదానః॥ ౨౯॥ ఇతి। యేపశవః- గ్రామ్యాః- గ్రామేభవాః - గవాశ్వాదయః॥ విశ్వరూపాః- జాతిభేదైర్బహువిధాః- విరూపాః - వర్ణాదిభేదేనవివిధాకారాః- ఏవంబహుధాదృశ్యమానాఃసంతః । అపిపునః పశుత్వాకారేణ ఏకరూపాః- తాన్- సర్వాన్- అగ్నిరూపః- సప్తహోతృదేవః- అగ్రే- ప్రముమోక్తు- ప్రథమం తత్తత్- స్థానం- ముంచతు - ప్రముచ్య అస్మభ్యం దదాత్విత్యర్థః - ప్రజాపతిః- చ- స్వకీయయా - ప్రజయా- సంవిదానః- ఐకమత్యంగతః- అస్మభ్యంపశూన్ దదాత్వితి శేషః॥

ప్రతిపదార్థం.

టీక॥ విశ్వరూపాః=జాతిచేననేక భేదములుకలవియు, విరూపాః=వర్ణముచేననేక భేదములుకలవియునై, బహుధాసంతః=అనేకవిధముగానున్నవగుచు, ఏకరూపాః =ఏక విధములగు గ్రామ్యాః=గ్రామములయందైన, యేపశవః=యేపశువులుకలవో, తాన్ =ఆపశువులను, అగ్ని దేవః=అగ్నిహోతృడు, అగ్రే=ముందుగా, ప్రముమోక్తు = విడిచిపెట్టుగాక, ప్రజాపతిః=చతుర్ముఖబ్రహ్మ. ప్రజయా=సంతానముతోటి, సంవిదానః=ఏకీభావమును పొందినవాడై, పశూన్=పశువులను, దదాతు=ఇచ్చుగాక.

తా॥ పైనముదహరించినరుక్కును చెప్పుచున్నాడు. ఏనుగులుగుఱ్ఱములు మొదలగు జాతిభేదముచే ననేకవిధములైనవియు, యెఱుపు నలుపు తెలుపు మొదలగు రంగులచే ననేకవిధములైనవియు నైనప్పటికిని మొత్తముమీద పశువులనిచెప్పుటచే నేకవిధముగానేయున్నట్టి యేనుగులు గుఱ్ఱములు లొట్టిపిట్టలు గోవులు వృషభములు యెనుములు గేదెలు మొదలగు గ్రామములయందుగల యేపశువులుకలవో ఆపశువులనన్నిటిని నగ్నిస్వరూపుడైన సప్తహోతృదేవుఁడు ముందుగా విడిచిపెట్టివేయుగా చతుర్ముఖబ్రహ్మ ఆపశువులనన్నిటిని మాకు నిచ్చుచుండుగాకయని యజమానుఁడుకోరుచున్నాడు.

అథ త్రింశతి మంత్రమాహ.

(30) పీతగ్ స్తుకేస్తుకే। యువమస్మాసు నియచ్ఛతం । ప్రప్రయజ్ఞపతింతిరః॥ 30॥

అథ భాష్యమ్.

అథత్రింశమాహ॥ 30॥ వీతగ్గ్ంస్తుకే— ప్రయజ్ఞపతాంతిరః॥ 30॥ ఇతి। హేఅగ్నిప్రజాపతీ- యువం- ఉభాయువాం-స్తుకేస్తుకే- తత్తద్గవాద్యపత్యే- వీతం- ప్రజననముత్పత్తిం- అస్మాసు- నియచ్ఛతం - నియమేనసంపాదయతం- యజ్ఞపతిం- యజమానం- ప్రప్రతిరః- అత్యంతం ప్రకర్షేణవర్ధయతం॥

ప్రతిపదార్థం.

టీక॥ యువం=మీరుభయులు, స్తుకేస్తుకే=ప్రతిసంతానమందు, వీతం=ఉత్పత్తిని, అస్మాసు=మాయందు, నియచ్ఛతం=మిక్కిలిసంభవింపజేయుఁడు యజ్ఞపతిః=యజ్ఞమును జేయునట్టి యజమానుని, ప్రప్రతిరః=మిక్కిలివృద్ధి నొందింపుడు.

తా॥ పైరుక్కునుగురించి చెప్పుచున్నాడు. ఓయగ్నిహోతృడా! ఓప్రజాపతీ! మీరుభయులును మాకు కలిగియుండెడి గోవులు మొదలగు ప్రజాపతి పశువులకును సంతానమును కలిగించి విశేషముగా వృద్ధినొందింపుడు. మఱియు యజ్ఞమును జేయునట్టియజమానుని మిక్కిలి వృద్ధినొందింపుడు.

అథ ఏకత్రింశతి మంత్రమాహ.

(31) యేగ్రామ్యాః పశవోవిశ్వరూపాః। విరూపాస్సన్తో బహుధైకరూపాః। తేషాగ్ంసప్తానామిహరంతిరస్తు। రాయస్పోషాయ సుప్రజాస్త్వాయసువీర్యాయ॥ 31।

అథ భాష్యమ్.

ఏక త్రింశతిమ్మంత్రమాహ॥ 31॥ యేగ్రామ్యాః—సువీర్యాయ॥31॥ ఇతి। గ్రామ్యాదిశబ్దాః పూర్వవద్వ్యాఖ్యేయాః తేషాం- గ్రామ్యపశూనాం। సప్తానాం- గోఽశ్వాజావి పురుషగజగర్ద భోష్ట్రరూపాణాం - సప్తసంఖ్యాకానాం- ఇహ- అస్మద్గృహే- రంతిః- క్రీడా- అస్తు- తచ్చ- ధనపుష్టి శోభనాపత్య శోభనవీర్యార్థం సంపద్యతే॥

ప్రతిపదార్థం.

టీక॥ విశ్వరూపాః=జాతివలన ననేకవిధములైనవియు, విరూపాః=వర్ణముచేననేక

విధములైనవియునై, బహుధాసంతః=బహురూపములుగానున్నవగుచు, ఏకరూపాః=ఒకే విధములైన, గ్రామ్యాః=గ్రామమునందుగల, యేపశవః=ఏపశువులుకలవో, తేషాం = ఆ, సప్తానాం=ఏడింటియొక్క, రంతిః=క్రీడ, ఇహ=మాగృహమందు, రాయస్పోషాయ=ధన వృద్ధికొరకును, సుప్రజాస్త్వాయ=యోగ్యమగు సంతానముకొఱకును, సువీర్యాయ=యోగ్య మగుబలముకొఱకును, అస్తు=అగుగాక.

తా॥ పైయొక్కరుక్కును గురించి చెప్పుచున్నాడు. గోవులు మొదలగు జాతి చేతను ఎరుపు మొదలగు వర్ణములచేతను ననేకవిధములైనప్పటికిని పశుజాతిలో చేరియుండుట చే నేకవిధముగానే జెప్పబడుచుండెడి గ్రామములలో సంచరించుచుండెడి యేపశువులు కలవో. గోవులు, అశ్వములు, మేకలు, గొఱ్ఱెలు, పురుషులు, ఏనుగులు, గాడిదెలు, ఒంటెలు, అనునట్టి యేడువిధములగు పశువులను మాక్షేత్రములయందు విహరించుచుండవ లయును. మాగృహమందు ధనవృద్ధియు యోగ్యమగు సంతానము కలుగవలయును మాకు నెల్లప్పుడును యోగ్యమగు శరీరబలము మొదలగునవియు కలుగవలయును.

అథ ద్వాత్రింశతి మంత్రమాహ.

(32) యఆరణ్యాః పశవోవిశ్వరూపాః । విరూపాస్సంతో బహుధైకరూపాః। వాయుస్తాగ్ం అగ్రేప్రముమోక్తుదేవః । ప్రజా పతిః ప్రజయాసంవిదానః॥ 32॥

అథ భాష్యమ్.

అథ ద్వాత్రింశతిమాహ॥ 32॥ యఆరణ్యాః—— సంవిదానః॥ (32) ఇతి। అరణ్యేభవాః- ఆరణ్యాః- ద్విఖురాః- శ్వాదిపదాదయస్తాన్- అరణ్యాధిపతిర్వాయుః- ప్రముమోక్తు- అన్యత్పూర్వవత్॥

ప్రతిపదార్థం.

టీక॥ విశ్వరూపాః= జాతివలననేక భేదములుకలవియు, విరూపాః= వర్ణమువలన ననేకభేదములుకలవియునై, బహుధాసంతః = అనేకవిధములుకలవియగుచున్నప్పటికిని, ఏకరూపాః=ఒకరూపముకలిగియున్న, ఆరణ్యాః=అరణ్యమునందు కలిగినటువంటి, యేపశ వః=ఏపశువులుకలవో, తాన్=ఆపశువులను, వాయుః= వాయువు, అగ్రే = ముందుగా, ప్రముమోక్తు=విడిచిపెట్టుగాక, ప్రజాపతిః=బ్రహ్మ, ప్రజయా=సంతానముతోటి, సంవిదా నః=ఏకీభవించినవాడై, అస్మభ్యం=మాకొఱకు, పశూన్=పశువులను, దదాతు=ఇచ్చుగాక,

తా॥ పై రుక్కునుగురించి చెప్పుచున్నాడు. జాతివలన ననేకవిధములై నటువంటిన్నీ వర్ణమువలనను బహువిధములైనటువంటిన్నీ పశుత్వజాతిచే నేకరూపముగా నున్నట్టి అరణ్యసంబంధమగు నేనుగులు గుఱ్ఱములు లేళ్ళు దుప్పులు, ఒంటెలు మొదలగు నేపశువులుకలవో. అట్టిపశువులను వాయువువిడిచివేయుగా వాటినన్నింటిని సంతానసహితముగానే ప్రజాపతి మాకునొసగుగాక.

అథ త్రయస్త్రింశతి మంత్రమాహ.

(33) ఇడాయైస్సృష్టం ఘృతవచ్చరాచరం। దేవాఅన్వవిందన్ గుహాహితం॥ 33॥

అథ భాష్యమ్.

33॥ ఇడాయైస్సృష్టం — గుహాహితం ॥ 33॥ ఇతి ।
ఇడాయై - గోసంపాదనార్థం - సృష్టం - ప్రాప్తం — ఘృతవత్ - ఘృతయుక్తం - ఘృతాకారమిత్యర్థః । తాదృశం - చరాచరం' స్థావరజంగమరూపం- జగదనుగృహీతుం- గుహాహితం- ప్రాణినాం బుద్ధావవస్థితం- సప్తహోతృదేవః- దేవాః- అన్వవిందన్ - అన్విష్య లబ్ధవంతః॥

ప్రతిపదార్థం.

టీక॥ ఇడాయై=గోవులు మొదలగువాటిని సంపాదించునిమిత్తము, సృష్టం=ప్రాప్తమైనట్టియు, ఘృతవత్=ఘృతమువలెయున్నట్టి।చరాచరం=స్థావరజంగమాత్మకమైన ప్రపంచమును అనుగ్రహించేకొఱకు, గుహాహితం=ప్రాణులయొక్క అంతకరణమునందుగల సప్తహోతృదేవుని, దేవాః=దేవతులు, అన్వవిందన్=విచారించి తెలిసికొనిరి.

తా॥ ముప్పదిమూడవరుక్కునుగురించి చెప్పుచున్నాడు. గోవులు మొదలగువాటిని పోషించుకొఱకును ఘృతమువలనే ప్రేమించతగిన యీప్రపంచమును అనుగ్రహించుకొఱకును సమస్తప్రాణులయొక్క యంతఃకరణములందు నివసించియుండెడి సప్తహోతృదేవుని కారణభూతునిగాను దేవతులందరు విచారించి తెలిసికొనిరి.

అథ చతుస్త్రింశతి మంత్రమాహ.

యసు ప్రజాస్త్వాయసువీర్యాయ॥ ౩౪॥

అథ భాష్యమ్.

అథ చతుస్త్రింశతిమంత్రమాహ॥ ౩౪॥ యఆరణ్యాః-సువీర్యాయ'౩౪ ఇతి సప్తానాం- ద్విఖురశ్వాపదపక్షిసరీ సృపహస్తి మర్కటనామధేయానాం- అన్యత్పూర్వవత్॥

ప్రతిపదార్థం.

టీక॥ విశ్వరూపాః=జాతివలన ననేకవిధములైనవియు, విరూపాః=వర్ణమువలన ననేకవిధములైనవియునై, బహుధాసంతః=అనేకవిధములైనవగుచు, ఏకరూపాః=ఒకవిధముగా నేయున్నట్టి, ఆరణ్యాః=అడవులయందైన, యేపశవః=ఏపశువులుకలవో, తేషాం=అటువంటి, సప్తానాం=ఏడింటియొక్క, రంతిః =క్రీడ, రాయస్పోషాయ = ధనవృద్ధికొఱకును, సుప్రజాస్త్వాయ=యోగ్యమగు సంతానముకొఱకును, సువీర్యాయ=యోగ్యమగు బలముకొఱకును, ఇహ=మాగృహమందు, అస్తు=అగుగాక.

తా॥ వైరుప్యమునుగురించి చెప్పుచున్నాడు. ఏనుగులు మొదలగు జాతివలనను నలుపు తెలుపు మొదలగు వర్ణమువలనను అనేకవిధములైనప్పటికిని పశువులనెడి జాతివలన నొక్కరూపముగా నేయున్నట్టియు నడవులయందు సంచరించునట్టి రెండుడెక్కలుగల జంతువులును, సింహములు భల్లూకములు పెద్దపులులు మొదలగుజంతువులును, కొంగలు నెమళ్లు మొదలగు పక్షులును, పాములు మొదలగు జంతువులును, ఏనుగులుమొదలగునవియు, కోతులు లేళ్ళు మొదలగు జంతువులను, వాయువుమొదట తనవశీకరణము నుండి విడిచివేయగా దేవతులు మాపరిసరప్రాంతమందు సంచరించులాగున చేతురుగాక. ఎందువల్లననగా. వాటివలనే ధనవృద్ధియు సంతానవృద్ధియు నొకవిధమగు బలవృద్ధియు కలుగును. కాబట్టి అట్టియరణ్యపశు సంపన్నత్వము మాకు దేవతులు కలుగజేయుచుండవలయును.

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యముని విరచితే వేదార్థ ప్రకాశే యజురారణ్యకే తృతీయ ప్రపాఠకే ఏకాదశోనువాకః

అథ భాష్యమ్.

ఏతైరేకా దశభిరనువాకై శ్చాతుర్హోత్రీయ చయనమంత్రా ఉక్తాః। అథనారాయణనామ్నా పురుషసూక్తనామ్నాచ వ్యవహ్రియ మాణోఽనువాక ఉచ్యతే। తస్యవినియోగం మహాగ్నా వాపస్తంబ ఆహ। పురస్తాత్ప్రతీచీంపురుషా కృతించినోతి- పురుషశిరోభవతి- సహస్రశీర్షాపురుష ఇత్యుపహితాం పురుషేణ నారాయణేన యజమాన ఉపతిష్ఠతేతి। బ్రహ్మమేధేపిప్రేతదాహోపస్థానేవినియోగం భరద్వాజ ఆహ। నారాయణాభ్యా ముపస్థానమితి। అయంచోత్తరశ్చేత్యు భావను వాకౌ। నారాయణసంజ్ఞౌ- నారాయణాఖ్యేన కేనచిదృషిణా - దృష్టత్వాత్ - జగత్కారణస్య- నారాయణాఖ్యస్య- పురుషస్య- ప్రతిపాదకత్వాచ్చ- తత్రాస్మిన్ ద్వాదశేఽనువాకే ప్రథమామృచమాహ॥

(౧) సహస్రశీర్షా—— అత్యతిష్ఠద్దశాంగులం॥ ౧॥ ఇతి। సర్వప్రాణిసమష్టిరూపో బ్రహ్మాండదేహో - విరాడాఖ్యోయః - పురుషః- సోయం- సహస్రశీర్షా- సహస్రశబ్దస్యోప లక్షణత్వాత్ -అనంతైశ్శిరోభిర్యుక్తఇత్యర్థః। యాని సర్వప్రాణినాం శిరాంసి - తాని - సర్వాణి- తద్దేహాంతః పాతిత్వాత్తదీయాన్యేవేతి సహస్రశీర్షత్వం - ఏవమక్షిషుపాదేష్వపియోజనీయం। సః- పురుషః- భూమిం- బ్రహ్మాండగోలకరూపాం- విశ్వతోవృత్వా- సర్వతః- పరివేష్ట్య- దశాంగులం - దశాంగుల పరిమితం దేశం- అత్యతిష్ఠత్ - అతిక్రమ్యవస్థితః- దశాంగులమిత్యుపలక్షణం- బ్రహ్మాండాద్బహిరపి- సర్వతోవ్యాప్యావస్థిత ఇత్యర్థః॥

ప్రతిపదార్థం.

టీక॥ సహస్రశీర్షా=వెయ్యిశిరస్సులుకలిగినట్టియు, సహస్రాక్షః = వెయ్యినేత్రములుకలిగినట్టియు, సహస్రపాత్ =వెయ్యిపాదములు కలిగినట్టియు, యః=ఏ పురుషః= విరాట్పురుషుఁడుకలఁడో, సః=ఆవిరాట్పురుషుఁడు, భూమిం=ప్రపంచమును, విశ్వతః=అంతటను, వృత్వా=వ్యాపించి, దశాంగులం=పదిఅంగుళిములుగల ప్రదేశమును, అత్యతిష్ఠత్ = అతిక్రమించి నివసించియుండెను.

తా॥ ఇదివరకుఁజెప్పఁబడిన పదకొండుఅనువాకములచే చాతుర్హోత్రీయ చయన సంబంధమగు మంత్రములు చెప్పఁబడినవి. నారాయణుఁడనెడు పేరుచేతఁగాని పురుషసూ

క్తమను పేరుచేతగాని వ్యవహరింపబడునట్టి పండ్రెండవ యనువాకమిప్పుడు చెప్పబడుచున్నది. మహాగ్ని విషయమై యీమంత్రమునకు వినియోగముకలుగునని ఆపస్తంబులుచెప్పెను. ప్రేతదాహోపస్థానమును గురించి బ్రహ్మమేధములో దీనియొక్క వినియోగము కలదనెడునుద్దేశ్యముచే నారాయణములచే నుపస్థానముజేయవలయునని భరద్వాజుఁడుచెప్పెను. నారాయణములనగా 'సహస్రశీర్షాపురుషః' "అద్భ్యస్సంభూతః పృథివ్యై" అనునట్టి మొదటిదియు రెండవదియును నారాయణానువాకములని చెప్పబడును. నారాయణుడనెడు యొకానొక మునీశ్వరునిచే కనిపెట్టబడినవి కాఁబట్టి నారాయణసంజ్ఞకలవి లేదా జగత్కర్తయునగు నారాయణుడనెడి విరాట్పురుషుని ప్రతిపాదించునవికాఁబట్టి నారాయణములనియైనను చెప్పకొనదగును. ఇప్పుడు పండ్రెండవ యనువాకములో మొదటి ఋక్కునుగురించి చెప్పచున్నాడు. వెయ్యిశిరస్సులు వెయ్యిపాదములు వెయ్యినేత్రములుకలిగినట్టి విరాట్పురుషుఁడు యీప్రపంచమునంతయు వ్యాపించి పైగా పదియంగుళములప్రదేశము నధిష్ఠించియుండెను. ఇక్కడ సహస్రశబ్దము దశాంగులశబ్దము వెయ్యియనియు పదియనియు నుపలక్షణములైనవేగాని అపరిమితార్థబోధకములుగా నిక్కడగ్రహింపవలయును కాఁబట్టియిక్కడ చెప్పకొనవలసినయర్థమేమనగా. బ్రహ్మాండదేహముచేప్రకాశించుచున్న విరాట్పురుషుని శరీరమందు సమస్తజీవరాసులు నివసించియున్నందున ననేకశిరస్సులును ననేకనేత్రములును ననేకబాహువులును ననేకపాదములును నిట్లుఅపమితమగు నవయవములతో ప్రకాశించెడు విరాట్పురుషుడు ప్రపంచమునంతయు వ్యాపించిబ్రహ్మాండముకంటె పైగానుండెనని యభిప్రాయము. ఇక్కడనేక శిరస్సులుమొదలగునవి కలవాడనిచెప్పట విరాట్పురుషునియందుగల ప్రాణులయొక్క యవయవములే ఆయనయవయవములుగా గ్రహింపవలయును.

అథ ద్వితీయ మంత్రమాహ.

(౨) పురుష ఏవేదగ్ం సర్వం। యద్భూతం యచ్చభవ్యం। ఉతామృతత్వస్యేశానః। యదన్నేనాతిరోహతి. ౨॥

అథ భాష్యమ్.

అథద్వితీయామాహ॥ ౨॥ పురుషఏవేదగ్ం—— యదన్నేనాతిరోహతి॥ ౨'ఇతి। యద్భూతం- అతీతం జగత్ - యచ్చభవ్యం- భవిష్యజ్జగత్ - యదపి- ఇదం- వర్తమానం జగత్ - తత్ - సర్వం- పురుషఏవ- యథా- అస్మిన్ - కల్పే- వర్తమానాః - ప్రాణిదేహాస్సర్వేపి-

విరాట్పురుషస్యావయవాః- తథాపవాతీతా గామినోరపి - కల్పయో ర్ద్రష్టవ్యం- ఉత- అపిచ- అమృతత్వస్య- దేవత్వస్య- అయం - ఈశానః- స్వామీ - యస్మాత్కారణాత్ - అన్నేన - ప్రాణినాంభోగ్యే నాన్నేన- నిమిత్తభూతేన- అతిరోహతి - స్వకీయకారణావస్థా మతిక్రమ్య- పరిదృశ్యమానం జగదవస్థాం ప్రాప్నోతి - తస్మాత్ప్రాణినాం- కర్మఫలభోగాయ జగదవస్థా స్వీకారాన్నేదంతస్య వస్తుతత్వమిత్యర్థః॥

## ప్రతిపదార్థం.

టీక॥ యద్భూతం=సృజింపబడినప్రపంచమేదికలదో, యచ్చభవ్యం=ముందుసృజింపబోవు ప్రపంచమేదికలదో, ఇదం=ఇప్పుడుకనబడుచున్న ప్రపంచమేదికలదో, సర్వం=సమస్తప్రపంచము, పురుషఏవ= విరాట్పురుషుడేయగును, ఉత=ఇంతేకాదు, అమృతత్వస్య=దేవత్వమునకు, ఈశానః=అధిపతి, యత్=ఏకారణమువలన, అన్నేన=అనుభవింపతగిన పదార్థముచేత, అతిరోహతి=అతిక్రమించియుండెనో, తత్=ఆకారణమువలన యథార్థము వేరైయున్నది.

తా॥ ఇప్పుడు రెండవరుక్కును జెప్పుచున్నాడు. పూర్వము సృజింపబడినదియు ముందు సృజింపబోవునదియు నిప్పుడుకనబడుచున్నట్టియు ప్రపంచమంతయు విరాట్పురుషునిస్వరూపమేయైయున్నది. ఈకల్పములోనున్నట్టి ప్రాణులయొక్క దేహములన్నియు విరాట్పురుషునకు నవయవములైనట్లుగానే గడచినకల్పములలోను ముందురాబోవు కల్పములలోను ఆవిధముగానే విరాట్పురుషుని యవయవములని తెలిసికొనవలయును. మరియు జననమరణరాహిత్యమగు నమృతస్వరూపుడైయుండును. ప్రాణులు యన్నమును భుజింపుచుందురనెడు కారణముచేత తనకారణావస్థనువదలి యీకనబడుచుండెడి స్థూలశరీరాత్మకమగు ప్రపంచావస్థనుపొందినట్లుగా కనబడుచుండును. కాబట్టిప్రాణులయొక్క కర్మఫలములననుభవింపజేయుటకు ప్రపంచస్వరూపమును స్వీకరించినవాడగుటచే నీశ్వరునకు నీకనబడు ప్రపంచరూపము యథార్థముకాదనియు సత్యమగుస్వరూపము పరమాత్మకు వేరుకలదనియు తెలిసికొనుడు.

## అథ తృతీయమంత్రమాహ.

(3) ఏతావానస్యమహిమా । అతోజ్యాయాగ్‌శ్చపురుషః। పాదోస్యవిశ్వాభూతాని। త్రిపాదస్యామృత దివి॥ 3॥

## అథ భాష్యమ్.

అథ తృతీయామాహ॥ 3॥ ఏతావానస్య—త్రిపాదస్యామృతం దివి। 3॥ ఇతి। అతీతానాగత వర్తమానరూపం జగద్యావదస్తి। ఏతావాన్- సర్వోఽపి- అస్యపురుషస్య- మహిమా - స్వకీయసామర్థ్య విశేషః- నతుతస్యవాస్తవం స్వరూపం- వాస్తవవస్తుపురుషః- అతః మహిమ్నోఽపి- జ్యాయాన్- అతిశయేనాధికః- ఏతచ్చ స్పష్టీక్రియతే- విశ్వా- సర్వాణి- భూతాని- కాలత్రయవర్తీనిప్రాణిజాతాని- అస్య - పురుషస్య- పాదః- చతుర్థోంశః- అస్య- అవశిష్టం- త్రిపాత్స్వరూపం-అమృతం- వినాశరహితం సత్ - దివి - ద్యోతమానాత్మకే - ప్రకాశస్వరూపే- అవతిష్ఠతే। యద్యపి- సత్యంజ్ఞానమనంతం బ్రహ్మేత్యామ్నాతస్య పరబ్రహ్మణ ఇయత్తాయా అభావాత్ - అంశచతుష్టయం ననిరూపయితుం శక్యం- తథాపి - జగదిదం బ్రహ్మస్వరూపాపేక్షయా త్యల్పమితి వివక్షితత్వాత్పాదవదలోపన్యాసః॥

## ప్రతిపదార్థం.

టీక॥ అస్య=ఈపురుషునియొక్క, మహిమా=సామర్థ్యవిశేషమైనది, ఏతావాన్= ఈప్రపంచమంతయునగును,పురుషః=ఈశ్వరుఁడు, అతః=ఈప్రపంచముకంటె జ్యాయాన్= అధికమైనవాడు, విశ్వా=సమస్తమగు, భూతాని = ప్రాణులు, అస్య = ఈభగవంతుని యొక్క, పాదః=నాల్గవవంతు, అస్య=ఈశ్వరునియొక్క, అమృతం = నాశనములేని స్వరూపము, దివి=ప్రకాశస్వరూపమునందు. త్రిపాత్ =మూఁడు వంతులు.

తా॥ ఇప్పుడు మూడవఋక్కును చెప్పుచున్నాడు. పూర్వము సృజియింపబడినదియు ముందు సృజియింపబోవునదియు నిప్పుడు సృజింపబడి కనబడుచున్నట్టియునగు సమస్తప్రపంచము ఈవిరాట్పురుషునియొక్క సృష్టిసామర్థ్యమేయైనది అయితేయిది యాతనియుదార్థస్వరూపము కాదు. వాస్తవస్వరూపమైతే యీప్రపంచముకంటె నధికమైనది అదియెట్లనగా. భూతభవిష్యద్వర్తమాన స్వరూపమగు మూడుకాలములందుఁల సమస్తప్రాణి విశిష్టమగు ప్రపంచమంతయు భగవంతుని స్వరూపములో నాల్గవవంతు యగును. ఈప్రపంచ స్వరూపమునకెంచునది భగవంతునియొక్క మిగిలిన మూఁడువంతుల స్వరూపము నాశనరహితమై స్వప్రకాశముగ బ్రకాశించుచుండును. అయితే "సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ" అనెడు శ్రుతిప్రమాణముచే పరబ్రహ్మస్వరూపము ఇంతపరిమితికల

దని చెప్పుటకు నలవికానందున ఈశ్వరుని స్వరూపము నాల్గుపాదములుకలదనియు చెప్పూటకూడ సందర్భమైనదికాదు. అయినప్పటికిని ఈప్రపంచము పరబ్రహ్మస్వరూపమని చెప్పుటచే నాధారాధేయభావముచే నీశ్వరునికంటె తక్కువయని తోచుటవలన నీశ్వరుని స్వరూపములో ప్రపంచస్వరూపము నాల్గవవంతుయని యూహింపబడుచున్నది.

అథ చతుర్థమంత్రమాహ.

(౪) త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః। పాదోఽస్యేహాఽభవాత్పునః। తతో విష్వఙ్వ్యక్రామత్। సాశనానశనేఅభి॥ ౪॥

అథ భాష్యమ్.

అథ చతుర్థీమాహ॥ ౪॥ త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః— సాశనానశనేఅభి॥ ౪॥ ఇతి। యోయం- త్రిపాత్- పురుషః- సంసారస్పర్శరహిత బ్రహ్మస్వరూపః। సోయం- ఊర్ధ్వఉదైత్- అస్మాదజ్ఞానకార్యాత్సంసారాద్బహిర్భూతస్సన్- అత్రత్యైర్గుణదోషైరస్పృష్టః- ఉత్కర్షేణస్థితవాన్- తస్య- యోయం- పాదః- లేశః - సోయం - ఇహ- మాయాయాం పునరాభవత్- సృష్టిసంహారాభ్యాం - పునఃపునరాగచ్ఛతి- అస్య- సర్వస్య- జగతః - పరమాత్మాంశత్వం - భగవతాప్యుక్తం- విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితోజగదితి- తతః- మాయయా- ఆగత్య- అనంతరం - విష్వఙ్ - దేవతిర్యగాది రూపో వివిధస్సన్- వ్యక్రామత్ - వ్యాప్తవాన్- కింకృత్వా - సాశనాశనే- అభి- లక్ష్యసాశనం- భోజనాది వ్యవహారోపేతం- చేతనం - ప్రాణిజాతం- అనశనం - తద్రహితమచేతనం - గిరినద్యాదికం - తదుభయం- యథాస్యాత్తథాస్వయమేవం విధోభూత్వా వ్యాప్తవానిత్యర్థః॥

ప్రతిపదార్థం.

టీక॥ త్రిపాత్=మూడుపాదములుకల అమృతస్వరూపముగు, పురుషః = పరమాత్మ, ఊర్ధ్వఉదైత్=సంసార రహితమైయుండగుచుండెను, అస్య=ఈ యీశ్వరునియొక్క, పాదః=నాల్గవయంశము, ఇహ=ఈసంసారమునందు, పునరాభవత్ = మాటిమాటికివచ్చుచుండును, తతః=అనంతరము, సాశనానశనే=అభి=సాశన=ఆహారముగల ప్రాణిస్వరూపముగాను, అనశనే=ఆహారములేని పర్వతాదులుగాను విష్వఙ్ = దేవతిర్యగాదిస్వరూపముగాను, అభివ్యక్రామత్=అంతటను వ్యాపించియుండిన వాడయ్యెను.

తా॥ నాల్గవరుక్కు చెప్పబడుచున్నది. మూడుపాదములుగలిగి సంసార రహితమై యమృతస్వరూపముగానున్నట్టి పరమాత్మ అజ్ఞానకార్యమగు సంసారముకంటె వేరుగానున్న వాడగుచు సంసారసంబంధమగు నేవిధమైనగుణదోషములచే నంటనివాడై యున్న స్థితియందుండెను. ఆపరమాత్మయొక్క నాల్గవయంశము మూలప్రకృతియనెడు మాయననుసరించి సృష్టిసంహారముల నొందునట్లుగా మాటిమాటికి నీసంసారచక్రములో జననమరణములనొందునట్లు కనుపించుచుండును ఈసమస్తప్రపంచము పరమాత్మయొక్క యంశమేయైయున్నది. అవిధముగానే శ్రీకృష్ణమూర్తియు జెప్పెను. ఎట్లనగా. ఈజగత్తునంతయు నొక్కయంశముచే వ్యాపించియుంటినని జెప్పెను. ఇట్లుమాయచేనాక్రమింపబడినపిమ్మట నాహారపదార్థములను భుజించిజీవించునట్టి ప్రాణిరూపమగు జంగమప్రపంచస్వరూపముగాను ఆహారమును భుజింపకయుండునట్టి స్థావరరూపమగు పర్వతములు నదులు మొదలగు స్థావర ప్రపంచస్వరూపముగాను మరియు సమస్తమగు దేవతిర్యగాదిప్రపంచస్వరూపుడై వ్యాపించియుండెను ఇట్లుపరమాత్మమాయను తనకులోబరచుకున్న వాడైనను మాయకులోబడినవాడువలెనే తనస్వరూపములో నాల్గవయంశముచే నీకనబడునట్టి సమస్తప్రపంచస్వరూపుడై వ్యాపించియుండెను.

అథ పంచమ మంత్రమాహ.

(౫) తస్మాద్విరాడజాయత। విరాజోఅధిపురుషః । సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమిమథోపురః। ౫॥

అథ భాష్యమ్.

అథ పంచమీమాహ॥ ౫॥ తస్మాద్విరాడజాయత —— పశ్చాద్భూమిమథోపురః॥ ౫॥ ఇతి। విష్వఙ్వ్యక్రామదితి యదుక్తం తదేవ ప్రపంచ్యతే। తస్మాత్ - ఆదిపురుషాత్ - విరాడజాయత - బ్రహ్మాండదేహ ఉత్పన్నః- వివిధం- రాజన్తేవ స్తూన్యత్రేతి- విరాట్ - విరాజో అధి- విరాట్ దేహస్యోపరి- స్థితమేవదేహ మధికరణం కృత్వా - పురుషః- తద్దేహాభిమానీకశ్చిత్పుమాన్- అజాయత - యోయం - సర్వవేదాంతవేద్యః పరమాత్మా- సఏవస్వకీయయామాయ యావిరాడ్దేహం బ్రహ్మాండం సృష్ట్వాతత్రజీవః - అభవత్ - ఏతచ్చాథర్వణికా ఉత్తరతాపనీయే సమామనంతి- సవాఏషభూతానీంద్రియాణివిరాజో దేవతాః కోశాంశ్చసృష్ట్వా ప్రవిశ్యామూఢోమూఢ ఇవవ్యవహరన్నా

స్తే- మాయయైవేతి- సజాతః- విరాట్పురుషః- అత్యరిచ్యత- అతిరిక్తో భూత్ - విరాడ్వ్యతిరిక్తో దేవతిర్యఙ్మనుష్యాది రూపోఽభూత్ - పశ్చాత్ - దేహాదిజీవభావాదూర్ధ్వం- భూమిం- ససర్జేతి శేషః- అథోభూమి సృష్టేరనంతరం- తేషాం జీవానాం- పురః- ససర్జ- ఆపూర్యన్తే సప్త భిర్ధాతుభిరితి పురశ్శరీరాణి॥

ప్రతిపదార్థం.

టీక॥ తస్మాత్ =ఆపరబ్రహ్మమువలన, విరాట్ =బ్రహ్మండదేహము, అజాయత= పుట్టెను, విరాజోఽధి=బ్రహ్మండదేహమునధిష్ఠానముజేసికొని, పురుషః=ఆదేహాభిమానము గలపురుషుడు, అజాయత=పుట్టెను, జాతః=పుట్టిన, సః=ఆపురుషుడు, అత్యరిచ్యత=ఆదే హముకంటె వ్యతిరిక్తుడైయుండెను, పశ్చాత్ =అనంతరము, భూమిం=భూమిని, ససర్జ= సృజించెను, అథః=అనంతరము, పురః=శరీరములనుసృజించెను.

తా॥ ఇప్పుడు అయిదవఋక్కును జెప్పుచున్నాడు. పరబ్రహ్మస్వరూపము దేవ తిర్యఙ్మనుష్యాది బహువిధముగా వ్యాపించియున్నదియని పూర్వముచెప్పబడినది. ఇప్పుడు దానినే వివరించిచెప్పుచున్నాడు. పరబ్రహ్మస్వరూపమగు ఆదిపురుషునివలన సమస్తజీవ రాశివిశిష్టమగు బ్రహ్మండదేహముత్పన్నమయ్యెను. బ్రహ్మండదేహముద్భవించినపిమ్మట ఆదేహమునధిష్ఠానముజేసికొని తద్దేహాభిమానియై జీవభూతముగ ప్రవేశించెను. ఆతనినే విరాట్పురుషుడని చెప్పుదురు. సర్వవేదాంతప్రతిపాద్యుడగు పరమాత్మ తనమాయచేత బ్రహ్మండస్వరూపమగు విరాడ్దేహమును సృజించి దానిలో జీవస్వరూపముగా ప్రవేశించి యున్నది. దీనినే యాథర్వణికులు ఉత్తరతాపనీయమనెడు గ్రంథములో జెప్పినదెట్లనగా ఈపరమాత్మయే పంచభూతములలు గుణములను ఇంద్రియములను దేవతులను కోశములను మొదలగువాటినన్నింటిని తనమాయచేతనే సృజియించి వానిలోబ్రవేశించి మూఢుడుకాని తాను మూఢుడువలెనే వ్యవహరించుచున్నాడని చెప్పిరి. ఇట్లుపుట్టిన విరాట్పురుషుడు బ్రహ్మండదేహముకంటె వ్యతిరిక్తముగా దేవతులు మనుష్యులు తిర్యగ్జంతువులు మొదలగు వివిధవస్తురూపముగా ప్రపంచస్వరూపుడయ్యెను. అనంతరము ఈజీవరాసులు నివసించు టకు భూమినిసృజించెను. అటుపిమ్మట సూక్ష్మరూపముగా సృజింపబడినప్రాణులకు కర్మ ఫలభోగముకొఱకు పంచభూతపంచకరణయుక్తములైన స్థూలశరీరములను సృజియించెను. ఇట్లు ప్రపంచమును సృజియించెను.

అథ షష్ఠమంత్రమాహ.

(౬) యత్పురుషేణహవిషా। దేవాయజ్ఞమతన్వత। వసన్తోఽస్యా

సీదాజ్యం । గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥ ౬॥

అథ భాష్యమ్.

అథ షష్ఠీమాహ॥ ౬॥ యత్పురుషేణ— గ్రీష్మఇధ్మశరద్ధవిః॥ ఇతి। పూర్వోక్తక్రమేణ దేవశరీరే షూత్పన్నేషు- తే- దేవాః- ఉత్తర సృష్టి సిధ్యర్థం- తత్సాధనత్వేన - యజ్ఞమతన్వత- కంచిద్యజ్ఞమన్వతిష్ఠన్। బాహ్యద్రవ్యస్యాప్య నుత్పన్నత్వేన హవిరంతరా సంభవాత్పురుష స్వరూపమేవ మనసా హవిష్ట్వేన సఙ్కల్ప్య తేన పురుషాఖ్యేన- హవిషా- యత్ - యదా- మానసం- యజ్ఞం- అతన్వత - తదానీం- అస్య- యజ్ఞస్య- వసంతర్తురేవ- ఆజ్యం- అభూత్ - తమేవాజ్యత్వేన సఙ్కల్పితవంతః। ఏవం- గ్రీష్మః- ఇధ్మత్వేనసంకల్పితః। శరత్ - పురోడాశాది హవిష్ట్వేన సంకల్పితా । పూర్వం పురుషస్య హవిస్సామాన్య రూపత్వేన సంకల్పః। వసంతాదీనా మాజ్యాది విశేషరూపత్వేనేతి ద్రష్టవ్యం॥

ప్రతిపదార్థం.

టీక॥ తేదేవాః=ఆదేవతులు, యత్=ఎప్పుడు, పురుషేణ=పురుషస్వరూపమగు, హవిషా=హవిస్సుచేత, యజ్ఞం=యజ్ఞమును, అతన్వత= చేసిరో, అస్య= ఈయజ్ఞమునకు, వసంతః=వసంతఋతువు, ఆజ్యం=నెయ్యిగాను, గ్రీష్మః=గ్రీష్మఋతువు, ఇధ్మః =సమిధలుగాను, శరత్=శరదృతువు, హవిః=హవిస్సుగాను, ఆసీత్=ఆయెను.

తా॥ ఇప్పుడు ఆఱవఋక్కునుచెప్పుచున్నాడు. పూర్వముచెప్పినప్రకారముగా దేవతాశరీరములు సృజింపబడినవి. ఆదేవతులటుపిమ్మట సృష్టిచేయదలచినవారై దానికిసాధనముగ నొకానొకయజ్ఞమును జేయబూనుకొని అందుకు హవిరాదివస్తువులంతకుపూర్వమే మియు లేనందున పురుషస్వరూపమునే హవిస్సుగాను మనస్సునసంకల్పించిన మానసయజ్ఞమును జేసిరి. ఆమానసయజ్ఞమునకు వసంతఋతువు ఆజ్యముగాను గ్రీష్మఋతువు ఇధ్మములుగాను శరదృతువు హవిస్సునుగాను సంకల్పించుకొని యజ్ఞమును ప్రారంభించిరి. అయితే పూర్వము పురుషుని హవిస్సామాన్యముగా సంకల్పించుకొనిరి. పిమ్మట వసంతఋతువు మొదలగువానిని ఆజ్యాదిరూపమగు విశేషదృష్టితో భావించి మానసయజ్ఞమును జేసిరి.

అథ సప్తమ మంత్రమాహ.

(౭) సప్తాస్యాసన్పరిధయః । త్రిస్సప్తసమిధఃకృతాః । దేవాయద్యజ్ఞం తన్వానాః అబధ్నన్పురుషంపశుం॥ ౭॥

అథ భాష్యమ్.

అథ సప్తమీమాహ॥ ౭॥ సప్తాస్యాసన్ పరిధయః— అబధ్నన్పురుషంపశుం॥ ౭॥ ఇతి। అస్య- సాంకల్పికయజ్ఞస్య- గాయత్ర్యాదీని- సప్త- ఛందాంసి- పరిధయః- ఆసన్- ఐష్టికస్యాహవనీయస్య- త్రయః పరిధయః- ఔత్తరవేదికాస్త్రయః - ఆదిత్యశ్చ సప్తమపరిధిప్రతినిధిరూపః- అతఏవామ్నాయతే। నపురస్తాత్పరిదధాత్యాదిత్యోహ్యేవోద్యన్పురస్తా ద్రక్షాగ్‌స్య పహంతీతిశ్రుతేః। తఏత ఆదిత్యసహితాస్సప్త పరిధయోఽత్ర సప్తఛందోరూపాః తథాసమిధః- త్రిస్సప్త- త్రిగుణితసప్తసంఖ్యాకాః- ఏకవింశతిః - కృతాః - ద్వాదశమాసాః- పంచర్తవః - త్రయఇమే - లోకాః - అసావాదిత్య ఏకవిగ్ంశ ఇతి శ్రుతాః- పదార్థా ఏకవింశతిదారుయుక్తేధ్మత్వేనభావితాః। యఃపురుషో వైరాజోస్తి- తం - పురుషం - దేవాః - ప్రజాపతిప్రాణేంద్రియరూపాః- యజ్ఞం- తన్వానాః- మానసయజ్ఞం కుర్వాణాః - పశుమబధ్నన్- విరాట్పురుషమేవ పశుత్వేన భావితవంతః ఏతదేవాభిప్రేత్యపూర్వత్రపురుషేణ హవిషేత్యుక్తం॥

ప్రతిపదార్థం.

టీక॥ అస్య=ఈయజ్ఞనమునకు, సప్త=ఏడు, పరిధయః=పరిధులు, ఆసన్=అయినవి త్రిస్సప్త=ఇరువైయొక్క, సమిధః=సమిధులు, కృతాః=చేయబడినవి, దేవాః=దేవతలు, యద్యజ్ఞం=ఏయజ్ఞమును, తన్వానాః=చేసిరో, తస్మిన్=ఆయజ్ఞమునందు, పురుషం=విరాట్పురుషుని, పశుం=పశువునుగాను, అబధ్నన్=కట్టిరి.

తా॥ ఇప్పుడేడవఋక్కును జెప్పుచున్నాడు. మనస్సంకల్పరూపమైన యీయజ్ఞమునకు గాయత్రి మొదలగు నేడు ఛందస్సులు పరిధులుగా నేర్పడియున్నవి. అనగా ఇష్టిసంబంధమైన యాహవనీయాగ్నియొక్క మూడుపరిధులును, ఉత్తరవేదికాసంబంధమగు మూడుపరిధులును, పరిధి ప్రతినిధిరూపమగు సూర్యుడును, మొత్తమేడుపరిధులగును. అం

దువల్లనే శ్రుతియందు జెప్పఁబడినదేమనగా. సూర్యుఁడు తూర్పున నుదయించి రాక్షసులను సంహరించుచున్నాడు కాబట్టి తూర్పున పరిధినుంచగూడదని చెప్పబడినది. ఇట్లుసూర్యుని తోఁగూడ నేడుపరిధులుగా జెప్పఁబడినవి యేడు ఛందస్సులనబడును. ఆప్రకారముగానే యిరువైయొక్క సమిథములును చెప్పబడినవి. అవియేవనగా పన్నెండుమాసములు అయిదురుతువులు మూడులోకములు సూర్యుడొకడును మొత్తము యిరువైయొక్కటి. లోకములోఁజేయబడెడి యజ్ఞమునకు కాష్ఠరూపమగు సమిధలను చేర్పరచినట్లుగానే యీమానస యజ్ఞమునకును పైనచెప్పబడిన మాసాదులనిరువైయొక్క సమిధలనుగా భావించిరి. ప్రజాపతికి ప్రాణేంద్రియస్వరూపులగు దేవతలు ఇట్లు మానసయజ్ఞమును చేయదలచినవారై విరాట్పురుషునే యజ్ఞపశువునుగాను భావించిరి. ఈయభిప్రాయముచేతనే పురుషుడనెడు హవిస్సుయని పూర్వముచెప్పబడినది.

## అథ అష్టమ మంత్రమాహ.

(౮) తంయజ్ఞంబర్హిషిప్రౌక్షన్। పురుషంజాతమగ్రతః। తేన దేవాఅయజంత। సాధ్యాఋషయశ్చయే॥ ౮॥

## అథ భాష్యమ్.

అథాష్టమీమాహ॥ ౮॥ తంయజ్ఞం బర్హిషిప్రౌక్షన్——సాధ్యాఋషయశ్చయే॥ ౮॥ ఇతి। యజ్ఞం- యజ్ఞసాధనభూతం - తం- పురుషం- పశుత్వభావనయాయూపే౽బధ్నన్- బర్హిషి - మానసేయజ్ఞే- ప్రౌక్షన్- ప్రోక్షితవంతః- కీదృశం- అగ్రతః - సర్వసృష్టేఃపూర్వం- పురుషంజాతం- పురుషత్వేనోత్పన్నం- ఏతచ్చపూర్వమేవోక్తం-తస్మాద్విరాడజాయత విరాజో౽అధిపూరుషఇతి- తేన - పురుషరూపేణ పశునా- దేవాః- అయజంత- మానసయాగంనిష్పాదితవంతః కేతేదేవాః ఇతి। తఏవోచ్యంతే। సాధ్యాః - సృష్టిసాధనయోగ్యాః - ప్రజాపతిప్రాణరూపా స్తదనుకూలాః- ఋషయః- మంత్రద్రష్టారశ్చ- యేసంతి తేసర్వేపి- అయజంత॥

## ప్రతిపదార్థం.

టీక॥ యజ్ఞం= యజ్ఞమునకు సాధనమగు, తం=ఆప్రసిద్ధమైనటువంటిన్ని, అగ్రతః=సృష్టికిపూర్వమందు, జాతం=ఉన్నటువంటి, పురుషం=విరాట్పురుషుని, బర్హిషి= మానసయజ్ఞమునందు బంధించినవారగుచు, ప్రౌక్షన్=ప్రోక్షించిరి, సాధ్యాః=సృష్టికిసా

ధనభూతులైన, దేవాః=దేవతులును, ఋషయః=మునీశ్వరులును,యే=యెవరుకలరో, తే=వారందరును, తేన=ఆపశువుచేతను, అయజంత=యజ్ఞముచేసిరి.

తా॥ ఇప్పుడెనిమిదవఋక్కును జెప్పుచున్నాడు. సృష్టికిసాధనభూతులును బ్రహ్మరూపాణేంద్రియస్వరూపులునగు దేవతులును, వారికిననుకూలురగు మంత్రప్రకాశకులైన మునీశ్వరులును విరాట్పురుషుని మానసయజ్ఞమునకు సాధనభూతమైన యజ్ఞపశువునిగా భావించి మనస్సంకల్పరూపమైన యూపస్తంభమందు బంధించిమంత్రోక్తముగా ప్రోక్షించి విరాట్పురుషరూపమగు పశువుచే మానసయజ్ఞమును గావించిరి.

అథ నవమ మంత్రమాహ.

(౮) తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। సంభృతంపృషదాజ్యం। పశూన్స్తాగ్ శ్చక్రేవాయవ్యాన్। ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే॥ ౮॥

అథ భాష్యమ్.

అథ నవమీమాహ॥ ౮॥ తస్మాద్యజ్ఞాత్సర్వహుతః—గ్రామ్యాశ్చయే॥ ౮॥ ఇతి। సర్వహుతః- సర్వాత్మకః- పురుషోహూయతే యస్మిన్ యజ్ఞేహూయతే సోయంసర్వహుతః - తాదృశాత్పూర్వోక్తాత్సర్వహుతో మానసాత్ - యజ్ఞాత్ - పృషదాజ్యం సంభృతం - సంపాదితం- దధిచాజ్యం చేత్యేవమాది భోగ్యజాతం - సంపాదితమిత్యర్థః- తథా- వాయవ్యాన్ - వాయుదేవతాకాన్ - లోకప్రసిద్ధాన్ - ఆరణ్యాన్- పశూన్- చక్రే- ఉత్పాదితవాన్- ఆరణ్యాః-ద్విఖురాదయః- తథా- యేగ్రామ్యాః- గవాశ్వాదయః- తానప్యుత్పాదితవాన్ - పశూనామంతరిక్షద్వారా వాయుదేవత్యత్వం - మంత్రాంతరవ్యాఖ్యానే సమామ్నాతం- వాయవస్థేత్యాహ। వాయుర్వాఅంతరిక్షస్యాధ్యక్షాః। అంతరిక్షదేవత్యాః ఖలువై పశవః। వాయవఏవైనాన్పరిదదాతీతి॥

ప్రతిపదార్థం.

టీక॥ సర్వహుతః=సర్వహుతమను పేరుగల, తస్మాత్=ఆ, యజ్ఞాత్= యజ్ఞమువలన, పృషదాజ్యం=నెయ్యి పెరుగు మొదలగునవియు, సంభృతం = పుట్టింపబడినవి, వాయవ్యాన్=వాయుదేవతాకమైనవియు, ఆరణ్యాన్= అరణ్యసంబంధమైనవియు, గ్రామ్యాశ్చ=గ్రామములసంబంధమైనవియు, యే=యేపశువులుకలవో, తాన్ = ఆసమస్తమగు, పశూన్=పశువులను, చక్రే=సృజియించెను.

తా॥ ఇప్పుడు తొమ్మిదవ ఋక్కును జెప్పుచున్నాడు. పూర్వము చెప్పబడిన సర్వహుతమనెడు మానసయజ్ఞమును జేయగా,దానివలన నెయ్యి పెరుగు పాలు మొదలగు భుజింపదగిన వస్తుసమూహములన్నియు కలిగెను. సర్వాత్మకుడగు విరాట్పురుషుఁడీయజ్ఞమునందు పశురూపముగా భావించి వేల్చబడినట్లు చెప్పబడినది కాబట్టి సర్వహుతమనఁబడెను. మరియు వాయుదేవతాకములై లోకప్రసిద్ధములగు రెండు డెక్కలుకలిగియున్నట్టియు యరణ్యములో సంచరించుచున్నట్టి సింహాదిమృగములును గ్రామములయందు తిరిగెడు గోమహిషాశ్వాది జంతువులను సృజియించెను. పశువులకు వాయుదేవతాత్వ మెట్లనగా. అంతరిక్షమనకు వాయువు ఆధిదేవతయనియు జెప్పి ఈపశువులను వాయువుకొఱకు నియ్యవలయునని మంత్రిబ్రాహ్మణమునందు జెప్పఁబడినది కాఁబట్టి యంతరిక్షముద్వారా పశువులువాయుదేవతాకములుగా జెప్పఁబడినవి.

అథ దశమ మంత్రమాహ.

(౧౦) తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। ఋచస్సామానిజజ్ఞిరే। ఛన్దాగ్ంసిజజ్ఞిరేతస్మాత్। యజుస్తస్మాదజాయత॥ ౧౦॥

అథ భాష్యమ్.

అథ దశమీమాహ॥ ౧౦॥ తస్మాద్యజ్ఞాత్— యజుస్తస్మాదజాయత॥ ౧౦॥ ఇతి। ఛందాంసి - గాయత్ర్యాదీని। స్పష్టమన్యత్॥

ప్రతిపదార్థం.

టీక॥ సర్వహుతః=సర్వమును హోమముజేయబడునట్టి, తస్మాత్ = అటువంటి, యజ్ఞాత్=యజ్ఞమువలన, ఋచః=ఋక్కులు, సామాని= సామములు, జజ్ఞిరే= కలిగినవి, తస్మాత్=ఆయజ్ఞమువలన, ఛందాంసి=గాయత్రి మొదలగు ఛందస్సులు, జజ్ఞిరే=కలిగినవి, తస్మాత్=ఆయజ్ఞమువలన, యజుః=యజుర్వేదము, అజాయత=పుట్టెను.

తా॥ పదియవమంత్రిమును జెప్పుచున్నాడు. సర్వాత్మకమగు పురుషునిగురించి హోమముజేయబడునట్టి మానసయజ్ఞమువలన ఋగ్వేదము యజుర్వేదము సామవేదము గాయత్రిమొదలగు ఛందస్సులు మొదలగునవియన్నియు కలిగినవి.

అథ ఏకాదశ మంత్రమాహ.

(౧౧) తస్మాదశ్వాఅజాయన్త। యేకేచోభయాదతః। గావోహజజ్ఞిరేతస్మాత్। తస్మాజ్జాతాఅజావయః॥ ౧౧॥

## అథ భాష్యమ్.

అథై కాదశీమాహ॥ ౧౧॥ తస్మాదశ్వాఅజాయంత—— తస్మాజ్జాతా అజావయః॥ ౧౧॥ ఇతి। అశ్వవ్యతిరిక్తాగర్ద భాః। అశ్వతరాశ్చయేకేచి దూర్ధ్వాధోభాగయో రుభయోర్దంతయుక్తాస్సంతి తేప్యశ్వవత్-అజాయంత। తథాగావః-అజాశ్చావయశ్చ తేసర్వేఽప్యుత్పన్నాః॥

## ప్రతిపదార్థం.

టీక॥ తస్మాత్=ఆయజ్ఞమువలన, అశ్వాః =గుఱ్ఱములు, ఉభయాదతః= రెండు ప్రక్కలను దంతములుగల, యేకేత్=ఏకొన్ని జంతువులుకలవో, తేపి= అవియును, అజాయంత=కలిగినవి, తస్మాత్=అయజ్ఞమువలన, గావః=గోవులు, జజ్ఞిరే=కలిగినవి, తస్మాత్=ఆయజ్ఞమువలన, అజావయః=మేకలు గొఱ్ఱెలు, జాతాః=కలిగినవి.

తా॥ పదకొండవమంత్రమునుగుఱించి చెప్పుచున్నాడు. ఆమానసయజ్ఞమువలన గుఱ్ఱములును వీటికంటె నితరములైనట్టియు క్రిందిభాగమునందు పైభాగమునందు దంతములుగల గాడిదలు కంచరగాడిదలు మేకలు గొఱ్ఱెలు మొదలగునవియు గోవులు వృషభములు యేనుగులు మొదలగు చతుష్పాదజంతువులన్నియు కలిగినవి.

## అథ ద్వాదశ మంత్రమాహ.

(౧౨) యత్పురుషంవ్యదధుః। కతిధావ్యకల్పయన్। ముఖంకిమస్యకౌబాహూ। కావూరూపాదావుచ్యేతే। ౧౨॥

## అథ భాష్యమ్.

అథ ద్వాదశీమాహ॥ ౧౨॥ యత్పురుషం—— కావూరూపాదావుచ్యేతే॥ ౧౨॥ ఇతి। ప్రశ్నోత్తరరూపేణ బ్రాహ్మణాదిసృష్టిం వక్తుమత్ర బ్రహ్మవాదినాం ప్రశ్నాఉచ్యంతే॥ ప్రజాపతేః ప్రాణరూపాదేవాః। యత్ - యదా- పురుషం- విరాడ్రూపం - వ్యదధుః - సంకల్పేనోత్పాదితవంతః। తదానీం- కతిధా- కతిభిః - ప్రకారైః - వ్యకల్పయన్- వివిధం కల్పితవంతః। ఏషసామాన్యరూపః ప్రశ్నః - ముఖం కిమిత్యాదయో విశేషప్రశ్నాః॥

## ప్రతిపదార్థం.

టీక॥ యత్=యెప్పుడు, పురుషం = విరాట్పురుషుని, వ్యదధుః = కల్పించిరో, తదా=అప్పుడు, కతిధా=ఎన్నివిధములుగా, వ్యకల్పయన్=కల్పించిరి, అస్య=ఈవిరాట్పురుషునియొక్క, ముఖం=ముఖము, కిం= ఎవరు, బాహూ=బాహువులు, కౌ= ఎవరు, ఊరూ=తొడలు, కౌ=ఎవరు, పాదౌ=పాదములు, కౌ=ఎవరు, ఉచ్యేతే = చెప్పఁబడుచున్నారు.

తా॥ పండ్రెండవమంత్రమును జెప్పుచున్నాడు. బ్రాహ్మణాదివర్ణములయొక్క సృష్టివిషయమై బ్రహ్మవేత్తలయొక్క ప్రశ్నలు చెప్పఁబడుచున్నవి. ప్రజాపతియొక్క ప్రాణస్వరూపులగు దేవతలు మానసయజ్ఞమునుగావించి యెప్పుడు విరాట్పురుషుని సృజయించిరో. అప్పుడు ఎన్నివిధములుగా సృష్టిజేయబడినదని సామాన్యముగా ప్రశ్నజేసి యీవిరాట్పురుషునియొక్క మొగమెవరు. బాహువులెవరు. తొడలెవరు. పాదములెవరు. అని యీవిధముగా విశేషరూపమగు ప్రశ్నను పిమ్మటజేసికొనిరి.

## అథ త్రయోదశ మంత్రమాహ.

(౧౩) బ్రాహ్మణోఽస్యముఖమాసీత్। బాహూరాజన్యః కృతః॥ ఊరూతదస్యయద్వైశ్యః। పద్భ్యాగ్ం శూద్రోఅజాయత। ౧౩॥

## అథ భాష్యమ్.

అథ త్రయోదశీమాహ॥ ౧౩॥ బ్రాహ్మణోఽస్య— అజాయత॥ ౧౩॥ ఇతి। యోఽయం బ్రాహ్మణజాతివిశిష్టః। పురుషః- సోఽయం- అస్య ప్రజాపతేః- ముఖం- ఆసీత్- ముఖాదుత్పన్న ఇత్యర్థః। యోఽయంరాజన్యః- క్షత్రియజాతిః- సబాహుత్వేన నిష్పాదితః- బాహుభ్యాముత్పాదిత ఇత్యర్థః। తత్ - తదానీం- యా- ప్రజాపతేః- ఊరూ- తద్రూపః వైశ్యః- సంపన్నః- ఊరుభ్యాముత్పన్న ఇత్యర్థః। తథా- పద్భ్యాం- శూద్రః- ఉత్పన్నః- ఇయంచముఖాదిభ్యో బ్రాహ్మణాదీనా ముత్పత్తిస్సప్తమకాండే 'సముఖతస్త్రివృతం నిరమిమీతేత్యాదా' విస్పష్టమామ్నాతా। అతఃప్రశ్నోత్తరే ఉభేఅపి తత్పరత్వే నైవయోజనీయే॥

## ప్రతిపదార్థం.

టీక॥ అస్య=ఈప్రజాపతియొక్క, ముఖం=ముఖము, బ్రాహ్మణః = బ్రాహ్మణుడై, ఆసీత్=ఆయెను, అనఁగా ముఖమువలన బ్రాహ్మణుఁడుపుట్టెను, బాహూ=బాహు

వులు, రాజన్యః=క్షత్రియుఁడుగా, కృతః=చేయఁబడెను, అనఁగా బాహువులవలనక్షత్రియ జాతికలిగెను, యత్=యే, వైశ్యః=వైశ్యజాతికలదో, తత్=ఆవైశ్యజాతి, అస్య=ఈప్రజా పతియొక్క, ఊరూ=తొడలు, అనఁగా ప్రజాపతితొడలవలన వైశ్యులుపుట్టిరి, పద్భ్యాం= పాదములవలన, శూద్రః=శూద్రుఁడు, అజాయత=పుట్టెను.

తా॥ పదమూడవమంత్రమును చెప్పుచున్నాడు ప్రజాపతియొక్క ముఖమువలన బ్రాహ్మణజాతియు, బాహువులవలన క్షత్రియజాతియు, తొడలవలన వైశ్యజాతియు, పాదములవలన శూద్రజాతియుకలిగెను. ఈప్రకారముగానే బ్రాహ్మణాదిసృష్టివిషమై యేడవకాండమందు "సముఖతస్త్రివృతం నిరమిమీత" అనుఁట్టిమంత్రములు మొదలగువా నిలోస్పష్టముగా జెప్పఁబడినది. అందువల్లనే ప్రశ్నము ఉత్తరము రెండును దాని నిమిత్తము గానే యోచించవలెను.

అథ చతుర్దశ మంత్రమాహ.

(౧౪) చన్ద్రమామనసోజాతః। చక్షోస్సూర్యోఅజాయత। ముఖా దిన్ద్రశ్చాగ్నిశ్చ। ప్రాణాద్వాయురజాయత॥ ౧౪॥

అథ భాష్యమ్

అథ చతుర్దశీమాహ॥ ౧౪॥ చంద్రమామనసోజాతః— ప్రాణా ద్వాయురజాయత॥ ౧౪॥ ఇతి। యథాదధ్యాజ్యాది ద్రవ్యాణి గవాదిప శవః ఋగాదివేదాః బ్రాహ్మణాదిమనుష్యాశ్చ తస్మాదుత్పన్నాః-ఏవం చంద్రాదయోదేవా అపితస్మాదేవోత్పన్నాః- చక్షోః- చక్షుషః- అజా యత- ఉత్పన్నః॥

ప్రతిపదార్థం.

టీక॥ మనసః=మనస్సువలన, చంద్రమాః=చంద్రుఁడు, జాతః=పుట్టెను, చక్షోః= నేత్రమువలన, సూర్యః=సూర్యుఁడు, అజాయత=పుట్టెను, ముఖాత్ = ముఖమువలన, ఇం ద్రశ్చ=ఇంద్రుఁడును, అగ్నిశ్చ=అగ్నిహోత్రుఁడును, అజాయత=పుట్టెను, ప్రాణాత్= ప్రాణమువలన, వాయుః=వాయువు, అజాయత=పుట్టెను.

తా॥ పదునాల్గవమంత్రమునుగురించి చెప్పుచున్నాడు. దధ్యాజ్యాదిపదార్థములును యేనుగులు గుఱ్ఱములు గోవులు మొదలగు పశువులును ఋగాదిచతుర్వేదములును మనుష్యు లును బ్రాహ్మణాదివర్ణములును కలిగియుండునట్టి భూలోకసృష్టివలెనే స్వర్గలోకసృష్టిని

గుతించియు జెప్పుచున్నాడు. అదియెట్లనగా. మనస్సువలన చంద్రుడును, నేత్రములవలన సూర్యుడును, ముఖమువలన నింద్రుడు అగ్నియు, ప్రాణమువలనవాయువును, కలిగిరి.

అథ పంచదశ మంత్రమాహ.

(౧౫) నాభ్యాఆసీదంతరిక్షం। శీర్ష్ణోద్యౌస్సమవర్తత। పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్। తథాలోకాగ్ం అకల్పయన్॥ ౧౫॥

అథ భాష్యమ్

అథ పంచదశీమాహ॥ ౧౫॥ నాభ్యాఆసీదంతరిక్షం— అకల్పయన్॥ ౧౫॥ ఇతి యథాదేవాస్తస్మాదుత్పన్నాః॥ తథాలోకానప్యంతరిక్షాదీన్- ప్రజాపతేః- నాభ్యాద్యవయవాత్। అకల్పయన్ - ఉత్పాదితవంతః॥

ప్ర తి ప దా ర్థ ం.

టీక॥ నాభ్యాః=నాభివలన, అంతరిక్షం=ఆకాశము, ఆసీత్=అయెను, శీర్ష్ణః=శిరస్సువలన, ద్యౌః=స్వర్గము, సమవర్తత=కలిగెను, పద్భ్యాం=పాదములవలన, భూమిః=భూమియు, శ్రోత్రాత్=చెవివలన, దిశః=దిక్కులును, అభూవన్=అయినవి, తథా=అప్రకారముగా, లోకాన్=లోకములను, అకల్పయన్=కల్పించిరి

తా॥ పదియేనవదరుక్కునుగురించి చెప్పుచున్నాడు. నాభివలన ఆకాశము, శిరస్సువలన స్వర్గము, పాదములవలన భూమియు, చెవులవలన దిక్కులును, ఇట్లు విరాట్పురుషుని యవయవములవలన దేవతలు సంభవించినట్లుగానే ప్రజాపతియొక్క నాభిమొదలగు నవయవములవలన చతుర్దశభువనంబులును మానసదేవతలు కల్పించిరి.

అథ షోడశ మంత్రమాహ.

(౧౬) వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణంతమస స్తుపారే। సర్వాణిరూపాణి విచిత్యధీరః। నామానికృత్వాభివదన్యదాస్తే॥

అథ భాష్యమ్.

అథషోడశీమాహ॥ ౧౬॥ వేదాహమేతం— యదాస్తే॥ ౧౬॥ ఇతి। యథోక్తవిరాట్పురుషధ్యాన మంత్రప్రతిపాద్యతే। తత్రమంత్రద్రష్టాస్వకీయం ధ్యానానుభవం ప్రకటయతి। యత్- యః- పురుషః-

సర్వాణిరూపాణి- దేవమనుష్య పశ్వాదిశరీరాణి- విచింత్య. విశేషేణ నిష్పాద్య- నామాని- చ- దేవోఽయం - మనుష్యోఽయం - పశురయ మిత్యాదీనికృత్వా- అభివదన్- తైర్నామభిరభితో వ్యవహరన్-ఆస్తే ఏతం- పురుషం- విరాజం- మహాన్తం - సర్వైర్గుణైరధికం - ఆదిత్య వర్ణం- ఆదిత్యవత్ప్రకాశమానం- వేద- అహం- జానామి- ధ్యానేన సర్వదా అనుభవామీత్యర్థః- సచపురుషః - తమసః పారే - అజ్ఞానా త్పరస్తాద్వర్తతే। అతోగురుశాస్త్రోపదేశ రహితై ర్మూఢై రనుభవితు మశక్య ఇత్యర్థః॥

ప్రతిపదార్థం.

టీక॥ ధీరః=ప్రజ్ఞావంతుడగు, యత్=ఏవిరాట్పురుషుడు, సర్వాణి=సమస్తమగు రూపాణి=స్వరూపములను, విచింత్య=విశేషముగ సృజించి, నామాని=నామధేయములను, కృత్వా=చేసి, అభివదన్=చెప్పుచు, ఆస్తే=ఉండెనో, మహాంతం=గొప్పవాడును, ఆదిత్య వర్ణం=సూర్యునివలెనే ప్రకాశించువాడును, తమసస్తుపారే=అజ్ఞానమునకు నవతల, విరా జం=ప్రకాశించుచున్నట్టి, ఏతం=ఈ, పురుషం=విరాట్పురుషుని, అహం=నేను, వేద= ఎరుగుదును.

తా॥ పదియారవమంత్రమునుగురించి చెప్పుచున్నాడు. పూర్వముజెప్పబడిన విరా ట్పురుషునిగురించిన ధ్యానము ఇచ్చట ప్రతిపాదించబడుచున్నది. మంత్రమును ప్రకటన జేసిన జ్ఞాని తనకు గలిగిన ధ్యానానుభవమును ప్రకటనజేయుచున్నాడు. ఏవిరాట్పురుషుడు దేవతులు మనుష్యులు పశులు మొదలగు చక్కగానాలోచించిజేసి యితడు దేవతుడనియు నితడు మనుష్యుడనియు నిది పశువనియు వ్యావహారిక నామములను కల్పించి వ్యవహరింప జేయుచునే విరాట్పురుషుండుండెనో సమస్తగుణములచేత నధికుడును సూర్యునివలెనే ప్రకాశించువాడును అజ్ఞానముకంటె భిన్నుడుగానుండిన జ్ఞానస్వరూపుడగునట్టి విరాట్పు రుషుని ధ్యానముచే నెల్లప్పుడు ననుభవముజేసికొనెదను. అని జ్ఞానితలచును కాబట్టి గురూ పదేశముగాని శాస్త్రజన్యజ్ఞానముగాని లేనట్టి మూఢులు అనుభవముజేసికొనలేరు.

అథ సప్తదశ మంత్రమాహ.

(౧౭) ధాతాపురస్తాద్య ముదాజహార । శక్రః ప్రవిద్వాన్ప్రది శశ్చతస్రః। తమేవం విద్వానమృతఇహ భవతి । నాన్యః పంథా అయ నాయవిద్యతే॥ ౧౭॥

అథ భాష్యమ్.

అథ సప్తదశీమాహ॥ ౧౭॥ ధాతా— అయనాయ విద్యతే॥ ౧౭॥ ఇతి। ధాతా- ప్రజాపతిః- యం- విరాట్పురుషం- ఉదాజహార- ధ్యాతౄణా ముపకారార్థం ప్రఖ్యాపితవాన్। చతస్రః- ప్రదిశః- చతుర్దిక్షు వర్తినస్సర్వాన్ ప్రాణినః- ప్రవిద్వాన్-ప్రకర్షేణజానన్-శక్రః- ఇంద్రః- తదనుగ్రహార్థం- ప్రఖ్యాపితవాన్ - ధాతురింద్రస్యోపదేశాత్- తం- విరాట్పురుషం- ఏవం- ఉక్తప్రకారేణ- విద్వాన్- సాక్షాత్ కుర్వన్- ఇహ - అస్మిన్నేవజన్మని - అమృతః - మరణరహితః- భవతి। యదావిరాట్పురుషోహమితి- సాక్షాత్కరోతి- తదానీం- వర్తమానదేహస్య తత్స్వరూపత్వాభావాత్ - తన్మరణేన - అయముపాసకోన మ్రియతే- అయనాయ- అమృతత్వప్రాప్తయే- అన్యః- పంథాః యథోక్తవిరాట్పురుష సాక్షాత్కార మంతరేణాన్యోమార్గః-నవిద్యతే నహికర్మసహస్రైరప్య మృతత్వం సంపాదయితుంశక్యతే। నకర్మణాన ప్రజయాధనే నేత్యాదిశాస్త్రాత్॥

ప్రతిపదార్థం.

టీక॥ ధాతా=ప్రజాపతి, పురస్తాత్=పూర్వమందు, యం=ఏవిరాట్పురుషుని, ఉదాజహార=ప్రకటింపజేసెనో, శక్రః=దేవేంద్రుడును, ప్రవిద్వాన్=బాగుగాదెలిసికొనినవాడై, చతస్రః=నాలుగైన, ప్రదిశః=దిక్కులయందు ప్రకటింపజేసెనో, తం=ఆవిరాట్పురుషుని, ఏవం=ఈ ప్రకారముగ విద్వాన్=తెలిసికొనినవాడు, ఇహ=ఈజన్మమునందే, అమృతః=మరణములేనివాడై, భవతి=అగుచున్నాడు. అయనాయ=మోక్షముకొరకు, అన్యః=ఇతరమైన, పంథాః=మార్గము, నవిద్యతే=లేదు.

తా॥ పదియేడవమంత్రమునుగురించి చెప్పుచున్నాడు. ధ్యానముజేయువారికి నుపకారార్థముగాను పూర్వమందు ప్రజాపతి యేవిరాట్పురుషుని ప్రకటింపజేసెనో యేవిరాట్పురుషునిదెలిసికొనినవాడై సమస్త దిక్కులయందునుండునట్టి సమస్తప్రాణుల ననుగ్రహించుటకుగాను వ్యాపింపజేసెనో ఇంద్రుడు సత్యస్వరూపము నుపదేశించి వ్యాపింపజేసినప్రకారముగా దెలిసికొనిన విద్వాంసుడు ఈజన్మమునందే మరణరహితుడై జీవన్ముక్తుడగును. అనగా నే విరాట్పురుషుడనెడి జ్ఞానానుభవముకలిగి సాక్షాత్కారముచేసికొనినంతటనే అప్పుడుండెడి దేహము జ్ఞానస్వరూపముగానుండుటచే శరీరమునశించినప్పటికీ

నుపాసనచేయుడు మృతినొందువాడు కాడు. అందువలన విరాట్పురుషసాక్షాత్కారముకంటె మరియొకమార్గము మోక్షమునిమిత్తములేదు. ఎన్ని వేలకర్మలనుజేసినప్పటికి మోక్షమును పొందుటకు సాధ్యముకాదు దీనినిగురించి యేకర్మగాని సంతానముగాని ధనముగాని మోక్షమును పొందుటకు తగినసాధనములుకావని శ్రుతియందు జెప్పఁబడినవి.

అథ అష్టాదశ మంత్రమాహ.

(౧౮) యజ్ఞేనయజ్ఞ మయజన్తదేవాః । తానిధర్మాణిప్రథమాన్యాసన్ । తేహనాకం మహిమానస్సచన్తే । యత్రపూర్వేసాధ్యాస్సన్తిదేవాః॥

అథ భాష్యమ్.

అథాష్టాదశీమాహ॥ ౧౮॥ యజ్ఞేన—— సంతిదేవాః॥ ౧౮॥ ఇతి। అత్రకృత్స్నానువాక తాత్పర్యం సంక్షిప్యోపన్యస్యతి। దేవాః - ప్రజాపతి ప్రాణరూపాః- యజ్ఞేన- యథోక్తేనమానసేన సంకల్పేన- యజ్ఞం యథోక్త యజ్ఞస్వరూపం- ప్రజాపతిం - అయజంత - పూజితవంతః- తస్మాత్పూజనాత్ - తాని- ప్రసిద్ధాని- ధర్మాణి - జగద్రూపవికారాణాం ధారకాణి- ప్రథమాని- ముఖ్యానిభూతాని- ఆసన్- ఏతావతా- సృష్టిప్రతిపాదకోనువాక భాగార్థః । సంగృహీతః। అథోపాసన తత్ఫలరూపోనువాక భాగార్థస్సంగృహ్యతే। యత్ర- యస్మిన్ విరాట్ప్రాప్తిరూపే- నాకే- పూర్వేసాధ్యాః- పురాతనా విరాడుపాస్తి సాధకాః- దేవాః- సంతి- తిష్ఠంతి- తం- నాకం - విరాట్ప్రాప్తిరూపం స్వర్గం- తే- మహిమానః- తదుపాసకా మహాత్మానః- సచంతే- సమవయంతి ప్రాప్నువంతి॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థ ప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకే ద్వాదశోనువాకః॥

ప్రతిపదార్థం.

టీక॥ యజ్ఞేన=మానసయజ్ఞముచేత, యజ్ఞం=ప్రజాపతిని, దేవాః=దేవతలు, అయజంత=పూజించిరి, తస్మాత్=అందువలన, తాని = అప్రసిద్ధమైన, ప్రథమాని = ముఖ్యమైన, ధర్మాణి=ధర్మములు, ఆసన్=అయినవి, యత్ర=ఏస్వర్గమునందు, పూర్వే = పురాతనులగు,

సాధ్యాః=ఉపాసకులు, సంతి=ఉండిరో, తే=అంటువంటి, మహిమానః= ఉపాసకులు, కం= అప్రసిద్ధమగు, నాకం=స్వర్గమును, సచంతే=పొందుచున్నారు.

తా॥ పదునేనిమిదవమంత్రమునుగురించి చెప్పుచున్నాడు. ఇప్పుడు పండ్రెండవ అనువాకముయొక్క తాత్పర్యమునంతయు సంక్షేపముగ జెప్పుచున్నాడు. ప్రజాపతి యొక్క ప్రాణస్వరూపులగు దేవతలు పూర్వముజెప్పబడిన మానససంకల్పరూపమగు యజ్ఞముచే యజ్ఞస్వరూపుడగు ప్రజాపతిని పూజించిరి. అందువలన ప్రపంచసృష్టి ప్రతి పాదకమైన ముఖ్యమగు కొన్ని ధర్మములు కలిగినవి ఇట్లు చెప్పుటచే సృష్టిప్రతిపాదకమగు అనువాకముయొక్క అర్థము చెప్పబడినది ఇక నుపాసనయు దానిఫలమునుగల అనువాక ముయొక్క అర్థముచెప్పబడుచున్నది. విరాట్పురుషుడగు ప్రజాపతి నుపాసనజేసినట్టు పూర్వపుదేవతలు విరాట్స్వరూపమును పొందుటయనే యేస్వర్గమును పొందిరో అట్టిస్వ ర్గమును విరాట్స్వరూపము నెప్పుడు నుపాసనజేయువారు తప్పకపొందుచున్నారు.

ఇట్లు యజురారణ్యక భాగములో మూడవపన్నమునందు
పండ్రెండవ యనువాకము సమాప్తము.

అథ త్రయోదశోనువాకః.

(౧) అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ। విశ్వకర్మణస్సమవర్త తాధి। తస్యత్వష్టావిదధద్రూపమేతి। తత్పురుషస్యవిశ్వమాజానమగ్రే౧

అ థ భా ష్య మ్.

అథోత్తరనారాయణాఖ్యః కశ్చిదనువాకస్తస్యచ వినియోగం పురుషమేధే ఆపస్తంబఆహ। ఉత్తరనారాయణేనాదిత్య ముపస్థాయేతి। తత్రప్రథమామృచమాహ॥ అద్భ్యస్సంభూతః—— విశ్వమాజానమగ్రే॥ ౧॥ ఇతి యోయం విరాడ్రూపో నారాయణాఖ్యః పురుషఃసోయం- అద్భ్యస్సంభూతః- సర్వత్రవ్యాప్తేషు జలేషు - క్షీరమధ్యే మండవ ద్బ్రహ్మాండ గోలక ముత్పన్నం- న కేవలమద్భ్య ఏవ- కింతు- పృథివ్యై రసాచ్చ- భూమ్యాః- సంబంధీ- యోయం రసస్సార స్తస్మా దప్యుత్ప న్నః మండస్యయోయం ఘనీభావః సపార్థివః। సచ - తన్మధ్యద్రవాం శాః- తే ఆప్యాః- యత్కఠినం- సాపృథివీ - యద్ద్రవంతదాపఇత్యాది శ్రుతేః। విశ్వకర్మణః- జగత్కర్తుః పరమేశ్వరాత్ - అధిసమవర్తత

ఆధిక్యేన నిష్పన్నః-యోయంబ్రహ్మాండాభిమానీచేతనః పురుషః సోయ మీశ్వరాంశః- తస్యవిరాట్పురుషస్య- రూపం - చతుర్దశలోకరూపావ యవసంస్థానం- విదధత్- విషాద్యయన్- త్వష్టా - విశ్వకర్మా - జగ దీశ్వరః- ఏతి- ప్రవర్తతే- పురుషస్య- విరాడాఖ్యస్య- సంబంధి తత్ విశ్వం- ప్రసిద్ధం- దేవమనుష్యాదిరూపం సర్వం- జగత్ -అగ్రేసృష్ట్యా దౌ- ఆజానం- సర్వతఉత్పన్నం॥

ప్రతిపదార్థం.

టీక॥ పురుషః= విరాట్పురుషుఁడు, అద్భ్యః=జలములవల్లను, పృథివ్యై = భూమి యొక్క, రసాచ్చ = రసమువల్లను, సంభూతః= పుట్టెను, విశ్వకర్మణః= సృష్టికర్తయగు పరమేశ్వరునివలన, అధిసమవర్తత= విశేషముగ పుట్టింపబడెను, తస్య= ఆవిరాట్పురుషుని యొక్క, రూపం= స్వరూపమును, విదధత్ =చేయుచు, త్వష్టా= సృష్టికర్త, ఏతి=ప్రవ ర్తించుచున్నాఁడు, పురుషస్య= విరాట్పురుషుని సంబంధమగు, తత్ = ఆప్రసిద్ధమగు, విశ్వం= ప్రపంచము, అగ్రే= సృష్టికిముందు, ఆజానం= అంతటను కలిగెను.

తా॥ ఇప్పుడుత్తరనారాయణమనెడి యనువాకము జెప్పఁబడుచున్నది. ఉత్తరనా రాయణానువాకముచే సూర్యప్రార్థన జేయవలయునని యాపస్తంబఋషి పురుషమేధము నందు జెప్పెను కాఁబట్టి ఆయనువాకములో మొదటిఋక్కును జెప్పుచున్నాఁడు. విరా ట్స్వరూపుఁడగు నారాయణుఁడనెడు పురుషుఁడు జలములవల్లను కలిగెను. అదియెట్లనగా ప్రాలయందు మీఁగడవలెనే జలములు అంతటను వ్యాపించియుండఁగా బ్రహ్మాండగోళకము పుట్టెను. అయితే వక్క జలమువల్లనే కలుఁగలేదు. మఱియు భూమియొక్క సారమువల్లను కూడ కలిగెను. అదియెట్లనగా. భూమియొక్క గుణము కఠినస్వభావముగాను జలము యొక్క గుణము ద్రవస్వభావముగానుండును కాఁబట్టి బ్రహ్మాండగోళకమునందుగల కఠి పదార్థములు భూమిసంబంధమైనవిగాను ద్రవాంశములు జలసంబంధమైనవిగాను తెలిసికొ నవలయును. ఇట్లుకఠినాంశ ద్రవాంశస్వరూపమైన విరాట్స్వరూపమగు బ్రహ్మాండగోళ కము సృష్టికర్తయగు పరమేశ్వరుఁడనెడి మూలపురుషునివలన విశేషముగ సృజింపబడెను. ఇట్లు బ్రహ్మాండాధిదేవతయగునట్టి యీశ్వరాంశయగు చైతన్యపురుషుఁడుచేత నాతనయు క్తమగు ప్రపంచమునంతయు ననగా పదునాలుగులోకములలోగల వానివానిస్వరూపము లను సృజియించుచు జగత్కర్తయగు పరమేశ్వరుఁడు ప్రవర్తించుచున్నాఁడు. ఇట్లు విరా ట్పురుషుని సంబంధమైన దేవమనుష్యాదిస్వరూపమగు ప్రపంచమంతయు సృష్టికిపూర్వ మంతటను అవ్యక్తరూపముగా కలిగియేయున్నది.

అథ ద్వితీయ మంత్రమాహ.

(౨) వేదాహమేతం పురుషం మహాన్తం । ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్। తమేవంవిద్వా నమృతఇహాభవతి। నాన్యఃపంథావిద్యతే உయనాయ। ౨॥

అ థ భా ష్య మ్.

అథ ద్వితీయామాహ॥౨। వేదాహమేతం— విద్యతేయనాయ॥ ౨॥ ఇతి। అన్యత్సర్వం పూర్వవద్వ్యాఖ్యేయం॥

ప్ర తి ప దా ర్థ ం.

టీక॥ ఆదిత్యవర్ణం= సూర్యుడువలెనే ప్రకాశించువాడును, తమసః= అజ్ఞానముకంటె, పరస్తాత్= దూరముగానుండువాడును, ఏతం= ఈ, మహాంతం = మహానుభావుడగు, పురుషం= పరమేశ్వరుని, అహం= నేను, వేద= తెలిసికొంటిని, తం= ఆపరమేశ్వరుని, ఏవం= ఈప్రకారముగ, విద్వాన్ = తెలిసికొనినవాడు, ఇహ= ఈలోకమునందే, అమృతః= మరణములేనివాడు, భవతి= అగుచున్నాడు, అయనాయ = మోక్షముకొఱకు, అన్యః=ఇతరమగు, పంథాః = మార్గము, నవిద్యతే = లేదు.

తా॥ రెండవఋక్కునుగురించి చెప్పుచున్నాడు. సూర్యుడువలెనే యితరసహాయములేక తనంతటనే ప్రకాశించువాడును మహానుభావుడగునట్టియు నజ్ఞానాంశమెంతమాత్రమునులేక నిత్యజ్ఞానస్వరూపుడునగు పరమేశ్వరుని అపరోక్షజ్ఞానముచే నిత్యసన్నిహితముగునట్లు తెలిసికొంటిని. ఇట్లు అపరోక్షజ్ఞానముచే తెలిసికొనిన విద్వాంసుడు ఈలోకమునందే మరణస్వభావములేనివాడై జీవన్ముక్తుడగును. కాబట్టి మోక్షమునొందవలెననెడి యపేక్షకలవానికి నపరోక్షాత్మజ్ఞానముకంటె మరియొకమార్గములేదు.

అథ తృతీయమంత్రమాహ.

(3) ప్రజాపతి శ్చరతిగర్భేఅంతః । అజాయమానో బహుధా విజాయతే। తస్యధీరాఃపరిజానన్తియోనిం। మరీచీనాంపదమిచ్ఛన్తివేధసః॥

అ థ భా ష్య మ్.

అథ తృతీయామాహ॥ 3॥ ప్రజాపతిశ్చరతి— పదమిచ్ఛన్తి వేధసః॥ 3॥ ఇతి। బ్రహ్మాండరూపే- గర్భే- అంతః - మధ్యే - ప్రజాపతిః- విగ్రహవాన్భూత్వా- చరతి-సచవాస్తవేనరూపేణ-సత్యంజ్ఞాన

మనః తం బ్రహ్మేత్యేతాదృశత్వాత్ - అజాయమానః- ఏవ- తథాపి- మాయికేనరూపేణ - బహుధా - స్థావరజంగమాది బహుప్రకారః- విశేషేణ- జాయతే- తస్య - ప్రజాపతేః - యోనిం - జగత్కారణ రూపం- వాస్తవం స్వరూపం- ధీరాః- ధైర్యవంతో- యోగేననిరుద్ధేంద్రియాః- మహాత్మానః- జానంతి- వేధసః- విధాతారః - సృష్టికర్తారః- తమేవోపాస్యం- మరీచీనాం- మరీచ్యత్రిప్రముఖానాం మహర్షీణాం- పదం- జగదుత్పాదకత్వలక్షణం- ఇచ్ఛంతి।

ప్రతిపదార్థం.

టీక॥ గర్భే= బ్రహ్మండస్వరూపమగు గర్భములో, అంతః= లోపలను, ప్రజాపతిః= బ్రహ్మ, చరతి= సంచరించుచున్నాడు, అజాయమానః= పుట్టనివాడై, బహుధా అనేకవిధములుగాను, విజాయతే = కలుగుచున్నాడు, తస్య = ఆప్రజాపతియొక్క యోనిం=కారణమును, ధీరాః=ధైర్యవంతులు, పరిజానంతి= తెలిసికొనుచున్నారు, వేధసః సృష్టికర్తలు, మరీచీనాం= మరీచి మొదలగుమునులయొక్క, పదం= స్థానమును, ఇచ్ఛంతి= అపేక్షించుచున్నారు

తా॥ మూడవరుక్కునుగురించిచెప్పుచున్నాడు. చతుర్దశభువనాత్మకమగు నీబ్రహ్మండగోళకములోపల స్థావరములుగాను జంగమ స్వరూపములుగాను పరమేశ్వరుడు విరాట్స్వరూపుడనెడు పేరుతో సంచరించుచున్నాడు. అయితే పరమేశ్వరునకు నుత్పత్తి స్థితిలయములులేకపోయినను తనమాయచే నుత్పత్త్యాదులుకలిగినట్లు స్థావరజంగమాత్మకమగు ప్రపంచముచే కనబరచుచున్నాడు. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనెడుశ్రుతి ప్రమాణముచే నుత్పత్త్యాదులు లేనట్లు స్పష్టముగాజెప్పబడుచున్నది. కాబట్టి అట్టిజగత్కారణుడగు పరమేశ్వరునియొక్క వాస్తవస్వరూపమును యోగాదులచే జితేంద్రియులగు మహానుభావులు తెలిసికొనుచున్నారు. మరీచి అత్రివసిష్ఠవాలఖిల్య యాజ్ఞవల్క్యాది మొదలగు గొప్పమహానుభావులగు మునీశ్వరులకు నుపాసించదగిన యాపరమాత్మస్వరూపమును చతుర్ముఖ బ్రహ్మ మొదలగు సృష్టికర్తలును తెలిసికొనవలయునని యపేక్షించుచున్నారు.

అథ చతుర్థ మంత్రమాహ.

(౪) యో దేవేభ్య ఆతపతి। యో దేవానాం పురోహితః। పూర్వోయో దేవేభ్యోజాతః। నమోరుచాయబ్రాహ్మయే॥ ౪॥

## అథ భాష్యమ్.

అథ చతుర్థీమాహా॥ ౪॥ యోదేవేభ్యః— రుచాయబ్రాహ్మయే॥ ౪॥ ఇతి। యః- పరమేశ్వరః - దేవేభ్యః । దేవార్థం - ఆతపతి- సర్వత్రప్రకాశతే। దేవానాం- దేవత్వసిద్ధయే - తత్తద్హృదయేషుచైత న్యరూపేణ ప్రవిశ్యావిర్భవతి। యః- చ - దేవానాం - పురోహితః- బృహస్పతిః- బభూవ- బృహస్పతిర్దేవానాం పురోహితః, ఇతి శ్రుతేః యః- చ- దేవేభ్యః- పూర్వోజాతః- ప్రథమభావీ హిరణ్యగర్భరూపే ణోత్పన్నః- 'హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే' ఇతిశ్రుతేః - తాదృశా య- రుచాయ- రోచమానాయ - స్వయంప్రకాశాయ-బ్రాహ్మయే- పరబ్రహ్మస్వరూపాయ - బ్రహ్మణా - వేదేన - ప్రతిపాద్యాయవా- నమః- నమస్కారోఽస్తు॥

## ప్రతిపదార్థం.

టీక॥ యః= ఏపరమేశ్వరుఁడు, దేవేభ్యః = దేవతులకొఱకు, ఆతపతి= అంతటను ప్రకాశించుచున్నాడో, యః= ఏపరమేశ్వరుఁడు, దేవానాం= దేవతులకు, పురోహితః= పురోహితుడయ్యెనో, యః= ఏపరమేశ్వరుఁడు, దేవేభ్యః= దేవతులకంటె, పూర్వః= మొదటివాడై, జాతః= జన్మించినో, తాదృశాయ= అంటువంటి, బ్రాహ్మయే=బ్రహ్మ సంబంధమగు, రుచాయ= తేజస్సుకొఱకు, నమః= నమస్కారము

తా॥ ఏపరమేశ్వరుఁడు దేవతలను సంరక్షించుటకై మత్స్యకూర్మవరాహాది అనేక స్వరూపములను ధరించి అంతటనువ్యాపించి ప్రకాశించుచున్నాడో, ఏపరమేశ్వరుడు దేవ తులయొక్క యుపకారముకొఱకు బృహస్పతియనెడు నామముచే పురోహితుడనబరగు చున్నాడో. ఏపరమేశ్వరుఁడు హిరణ్యగర్భుడనెడు నామముచే విరాట్స్వరూపుడై దేవ తులకంటెను ముందుగానే యుద్భవించియుండెనో. అట్టిస్వయంప్రకాశమానుఁడును సర్వ జీవానందకరుడును బ్రహ్మచేతనుగాని వేదముచేగాని ప్రతిపాదింపబడునట్టి పరబ్రహ్మస్వ రూపమునకు నమస్కారముజేసెదను.

## అథ పంచమ మంత్రమాహా.

(౫) ఋచంబ్రాహ్మం జనయన్తః । దేవాఅగ్రే తదబ్రువన్। యస్త్వైవం బ్రాహ్మణోవిద్యాత్ । తస్యదేవా అసన్వశే॥ ౫॥

## అథ భాష్యమ్.

అథ పంచమీమాహ॥ ౫॥ రుచం బ్రాహ్మం—దేవాఅసన్వశే॥ ఇతి॥ దేవాః- సర్వే- అగ్రే- సృష్ట్యాదౌ - బ్రహ్మవిద్యాసంప్రదాయ ప్రవర్తనకాలే- బ్రాహ్మం రుచం- పరబ్రహ్మసంబంధిచైతన్యం - జనయంతః- విద్యయాపాపదుర్భావయంతః- తత్ - బ్రహ్మతత్వం - సంబోధ్య- అబ్రువన్- వక్ష్యమాణం వాక్యముక్తవంతః- కింతద్వాక్యమితి- తదుచ్యతే। హేపరమాత్మన్- యః- కశ్చిత్ - బ్రాహ్మణః-పుమాన్- త్వాం- ఏవం- యథోక్తప్రకారేణ- విద్యాత్ - తస్య - బ్రహ్మవిదః- సర్వదేవాః- వశే- అసన్ - అధీనాభవంతీతి- స్వయంహి తేషాం దేవానామంతర్యామీ పరమాత్మాభవతి- తస్మాద్దేవాఏతదధీనా- సత్వస్య దేవా ఈశ్వరాః - ఏతమేవార్థం వాజసనేయినో విస్పష్టమామనంతి। యఏవం వేదాహం బ్రహ్మాస్మీతిస ఇదగ్ంసర్వంభవతి। తస్యదేవాశ్చ నా భూత్యా ఈశతే। ఆత్మాహ్యేషాం సభవతీతి।

## ప్రతిపదార్థం.

టీక॥ అగ్రే= పూర్వమందు, బ్రాహ్మం = బ్రహ్మసంబంధమగు, రుచం = తేజస్సును, జనయంతః= ప్రకటింపజేయుచున్నవారై, దేవాః= దేవతులు, తత్= ఆపరమాత్మనుద్దేశించి, అబ్రువన్ = పలికిరి, యః = ఏ బ్రాహ్మణస్తు = బ్రాహ్మణుఁడైతే, ఏవం= ఈప్రకారముగా, విద్యాత్= తెలిసికొనునో, తస్య= వానియొక్క, వశే= స్వాధీనమందు, దేవాః= దేవతులు, అసన్= ఉందురు

తా॥ అయిదవఋక్కునుగురించి చెప్పుచున్నాడు. సృష్టికిపూర్వమందు దేవతులు వేదాంతవిచారణజేసి ఆత్మజ్ఞానముచే పరమాత్మస్వరూపమును ప్రకటనజేయుచున్నవారై యాపరమాత్మనుద్దేశించి దేవతులు పలికినదేమనఁగా ఓపరమాత్మా యేబ్రాహ్మణుఁడైనను శాస్త్రమునందు జెప్పఁబడినట్లుగా నీనిజస్వరూపమును తెలిసికొనునో సమస్తదేవతులును వానిస్వాధీనులుగానుండెదరు. దీనినిగురించి వాజసనేయిశాఖయందు స్పష్టముగా వివరింపబడినది. ఎట్లనఁగా. ఎవడు నేనేబ్రహ్మయని తెలుసికొనుచున్నాడో వాడే యీకనబడుచుండెడి సమస్తప్రపంచస్వరూపమగు పరమాత్మయేయగును కాఁబట్టి సమస్తదేవతులకును వాత్మస్వరూపుడేయగును. అందువలన సర్వదేవతులును ఆత్మజ్ఞానికి స్వాధీనులని చెప్పబడిరి.

అథ షష్ఠమంత్రమాహ.

(౬) హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ। అహోరాత్రేపార్శ్వే। నక్షత్రాణిరూపం। అశ్వినౌవ్యాత్తం। ఇష్టంమనిషాణ। అముంమనిషాణ। సర్వం మనిషాణ। ౬।

అథ భాష్యమ్.

అథ యజురాత్మానం కంచిన్మంత్రమాహ॥ ౬॥ హ్రీశ్చతే— సర్వం మనిషాణ॥ ౬॥ ఇతి। హ్రీః - లజ్జాభిమానినీ దేవతా। లక్ష్మీః- ఐశ్వర్యాభిమానినీదేవతా। హేపరమాత్మన్- హ్రీశ్చ- లక్ష్మీశ్చ- తే- తవ- పత్న్యౌ- భార్యాస్థానీయే- యేచ- అహోరాత్రే- తే- పార్శ్వే పార్శ్వద్వయస్థానీయే। నక్షత్రాణి - ఆకాశేదృశ్యమానాని - తాని- తవ- రూపం- తవ శరీరస్థానీయం। అశ్వినౌ యౌదేవతౌ- తవవ్యాత్తం వివృతముఖస్థానీయం- తథావిధ హే విరాట్పురుష- ఇష్టం- అస్మదపేక్షితం- ఆత్మబోధం- మనిషాణ- అనుమన్యస్వ- దేహీత్యర్థః- అముంలోకేదృశ్యమానంగవాశ్వాదికం- మనిషాణ- ప్రయచ్ఛ- కింబహునా- సర్వంమనిషాణ- ఐహికమాముష్మికంవా సర్వంఇష్టం- దేహి॥

ఇతి శ్రీమత్సాయన మాధవాచార్య శ్రీవిద్యారణ్యమునివిరచితే వేదార్థప్రకాశే యజురారణ్యకే తృతీయప్రపాఠకేత్రయోదశోనువాకః.

ప్రతిపదార్థం.

టీక॥ హేపరమాత్మన్= ఓపరమాత్మా, హ్రీశ్చ= హ్రీయనునదియు, లక్ష్మీశ్చ= లక్ష్మియనునదియు, తే= నీకు, పత్న్యౌ= భార్యలు, అహోరాత్రే= పగలురాత్రియును, పార్శ్వే=పార్శ్వభాగములు, నక్షత్రాణి= నక్షత్రములు, రూపం= నీస్వరూపము, అశ్వినౌ= అశ్వినీ దేవతలు, వ్యాత్తం= తెరువబడినముఖము, ఇష్టం= నేనుకోరినదానిని, మనిషాణ= అంగీకరింపుము అనఁగా నివ్వవలయును, అముం= ఈలోకమునందుగల పదార్థములను, మనిషాణ= ఇమ్ము, సర్వం= సమస్తమును. మనిషాణ= ఇమ్ము.

తా॥ ఆఋషియజ్ఞునుగురించి చెప్పుచున్నాడు, హ్రీయనునది సిగ్గునకు నధిదేవత, లక్ష్మియనునది సంపత్తునకు నధిదేవతయని చెప్పఁబడును పరమాత్మా నీవుసమస్తప్రపంచ స్వరూపుడవైయుంటివి కాఁబట్టి హ్రీయు లక్ష్మియు నిద్దరు నీకు భార్యారూపులుగాను,

రాత్రియుపగలును రెండును నీకురెండుప్రక్కలునుగాను, ఆకాశమందుగనబడునట్టి నక్షత్రములు నీకుశరీరముగాను అశ్వనీదేవతులు తెరువబడియుండునట్టి నీయొక్కముఖముగాను యజుర్వేదశ్రుతి నీవిరాట్స్వరూపమునుగురించి వర్ణించియున్నది. కాబట్టి యోవిరాట్స్వరూపమగు నోపరమాత్మ నేనుకోరినట్టి యాత్మజ్ఞానమును ముక్తినొందుటకు నొసగుము. మఱియు నేనుజీవించియుండునంతకాలము జీవనస్థితిగడుపుటకై గవాశ్వాదికము ధనధాన్యాది సమస్త సంపత్తులును నొసగుము. ఇది యది అనిచెప్పనేల ఇహలోకసుఖములను పరలోకసుఖములను ఆత్మజ్ఞానమును సర్వమును నొసగవలయునని కోరుచున్నాడు.

ఇట్లు విద్యారణ్య మునీశ్వరునిచే రచింపబడినవేదార్థ ప్రకాశిక యను వ్యాఖ్యగల యజురారణ్యక తృతీయప్రపాఠకే త్రయోదశోనువాక స్సమాప్తః.

అథ చతుర్దశోనువాకః.

(౧) భర్తాసన్భ్రియమాణోబిభర్తి। ఏకోదేవోబహుధానివిష్టః। యదాభారంతన్ద్రయతేసభర్తుం। నిధాయభారం పునరస్తమేతి॥

అథ భాష్యమ్.

అథభర్తృసూక్తాఖ్యః కశ్చిదనువాకోఽభిధీయతే తస్యచమృత్యవే దేహితమిత్యస్మిన్ పశౌనాదిష్టహోమానంతరం ఉపహోమార్థత్వేన వినియోగోద్రష్టవ్యః। తథాచాపస్తంబ ఆహ। మృత్యవేదేహితం తత్రభర్తారముప జుహుయాదితి। తత్రప్రథమామాహ॥౧॥భర్తాసన్ — పునరస్తమేతి ౧॥ ఇతి। యోయంప్రాణాభిమానీ దేవస్సోయం- భర్తా పోషకః- సన్- భ్రియమాణః- అంతర్యామిణా పరమేశ్వరేణ-స్వయం ధార్యమాణస్సన్- బిభర్తి- దేహాన్ - ధారయతి । సచసూత్రాత్మరూపేణ- స్వయం- ఏకఏవ- దేవః- తత్తచ్ఛరీరేషు- బహుధా - శరీరానుసారేణ- బహుప్రకారః- నివిష్టః- అవస్థితః। అతఏవ-ప్రాణవిద్యాప్రకరణే- తత్తచ్ఛరీరానుసారేణ- ప్రాణస్యావస్థితిం- కాణ్వాఆమనంతి। మనఃప్లుషిణా- సమోమశకేన - సమోనాగేన - సమఏభిస్త్రిభిర్లోకైరిత్యాది। సః- ప్రాణః- యదా- భారం- దేహరూపం- భర్తుం- ధారయితుం- తన్ద్రియతే- తన్ద్రీమాలస్యం- ప్రాప్నోతి - ఆయుషోఽవసా

నేహితస్యాలస్యంభవతి- తదానీం- భారం - దేహరూపం - నిధాయ- క్వచిదుత్సృజ్య- పునః- అస్తమేతి- అదర్శనంగచ్ఛతి- యథా-దేహోత్పత్తేః పూర్వమదర్శనం గతస్తథా దేహపాతాదూర్ధ్వం - అతీత్యాభిప్రేత్య పునరిత్యుక్తం॥

## ప్రతిపదార్థం.

టీక॥ భర్తాసన్= పోషకుడగుచు, భ్రియమాణః = భరింపబడినవాడై, బిభర్తి= దేహములను భరించుచున్నాడు, ఏకః=ఒక్కడగు, దేవః=దేవుడు, బహుధా = అనేకరూపములుగా, నివిష్టః= ప్రవేశించియుండెను, యదా = ఎప్పుడు, భారం= భారమును, భర్తుం= ధరించుటకొరకు, సః= ఆప్రాణము, తంద్రియతే= ఆలస్యమును జేయుచున్నదో, తదా= అప్పుడు, భారం= భారమును, నిధాయ= ఉంచి, పునః= తిరిగి, అస్తమేతి=అస్తమానమును పొందుచున్నది

తా॥ ఇప్పుడు భర్తృసూక్తమనెడి యొకానొక యనువాకము చెప్పబడుచున్నది. ఇందునుగురించి యాపస్తంబుడు చెప్పినదేమనగా మృత్యువుకొఱకు పశువునివ్వవలయును. అందుకొఱకు భర్తనుగూర్చియు నీహోమము జేయవలయునని చెప్పెను కాబట్టి అరిష్టశాన్తినిమిత్తమై యుపహోమముకొరకు వినియోగముగా చూచుకొనవలయును. ఇప్పుడు మొదటిరుక్కును జెప్పుచున్నాడు.(వాయుస్వరూపుని వ్యవహరింపబడుచు ప్రాణాభిమానియగు దేవతయంతర్యామిగానుండెడి పరమాత్మయొక్క సత్తావలన శరీరమును పోషించుచు శరీరమును ధరించుచున్నాడు.)(అట్టిప్రాణము తానుఒక్కడేయగుచు సూత్రాత్మరూపముగా నానాశరీరములయందు స్థూల సూక్ష్మాదిరూపములననుసరించి బహువిధములుగానుండును.)అందువల్లనే యాయాశరీరములననుసరించి ప్రాణమునివశించుటనుగుఱించి ప్రాణవిద్యాప్రకరణములలోకాణ్వులు చెప్పినదేమనగా జీవాత్మమనస్సునందు ప్రతిబింబితుడైయుండుటచే దోమయొక్క శరీరమునందుసూక్ష్మముగాను ఏనుగుయొక్క శరీరమునందు స్థూలస్వరూపుడుగాను ఇట్లుఆయాశరీరముల స్థూలసూక్ష్మరూపములననుసరించి యాజీవాత్మయు మూడు లోకములందువ్యాపించియుండును.(అట్టిప్రాణము ఆయుర్దాయము సరిపోవునంతవరకు దేహరూపమైనభారమును ధరించియుండును. ఆయుర్దాయముసరిపోయినపిమ్మట దేహరూపమైన భారమునువిడిచిపెట్టి కనపడకనుండును.) అనగా పుట్టుటకుపూర్వమెట్లు కనబడకయుండునో ఆవిధముగానే మృతినొందినపిమ్మట దేహమునశించుటచే జీవుడును అదర్శనుడైయుండును.

అథ ద్వితీయ మంత్రమాహ.

(౨) తమేవమృత్యుమమృత తమాహుః । తంభర్తార తముగోప్తార మాహుః। సభృతోభ్రియమాణోబిభర్తి। యఏనం వేదసత్యేనభర్తుం॥౨

అథ భాష్యమ్.

అథ ద్వితీయామాహ॥ ౨॥ తమేవ—— వేదసత్యేనభర్తుం। ౨॥ ఇతి। వేదరహస్యాభిజ్ఞాః పురుషాః - తమేవ - ప్రాణం - మృత్యుమాహుః। యదాప్రాణో దేహాన్నిర్గచ్ఛతి- తదైవదేహోమ్రియతే। అతో మృత్యుహేతుత్వాన్మృత్యుత్వం తథాదేహేఽవస్థితే- అమృతోదేహ ఇత్యమృతత్వహేతుత్వాత్ - తం- ప్రాణం - అమృతమాహుః- శరీర స్థాపనహేతుత్వాత్ - తం- ఏవ- ప్రాణం- భర్తారం - దేహస్యధారయితారమాహుః। తథాచ కౌషీతకినస్సమామనతి। అథఖలుప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతీతి। తథాతమేవప్రాణం- అన్నపానాది స్వీకారహేతుత్వాత్ - గోప్తారం - పోషకం - ఆహుః- తథాచ ఛందోగా అన్నపానాది స్వీకారసాధనత్వం - ప్రాణస్యామనంతి యదశ్నాతి యత్పిబతి తేనేతరాన్ ప్రాణానవతీతి। యః-పుమాన్ ఏనం- ప్రాణం- సత్యేన- శ్రుతిస్మృత్యుదితేన- సమ్యఙ్మార్గేణ-భర్తుం ధ్యానకాలే చిత్తే ధారయితుం- వేద- జానాతి- సః-ఉపాసకః-పుమాన్ భృతః- పరమేశ్వరేణాదౌ పోషితః- భ్రియమాణః- అనేనప్రాణవాయునాధార్యమాణస్సన్- బిభర్తి- స్వయమితరాన్ ప్రాణినశ్చపోషయితుం- సమర్థోభవతి॥

ప్రతిపదార్థం.

టీక॥ తమేవ= ఆప్రాణమునే, మృత్యుం= మృత్యుదేవతనుగాను, తం= ఆప్రాణమునే, అమృతం= జీవింపజేయునదిగాను, ఆహుః= చెప్పిరి, తం= ఆప్రాణమును, భర్తారం= దేహమునుధరించునదిగాను, తమ= ఆప్రాణమునే, గోప్తారం= పోషించునదిగాను, ఆహుః= చెప్పిరి, యః=ఏమనుష్యుడు, ఏనం=ఈప్రాణమును, సత్యేన= యోగ్యమగుమార్గముచే, భర్తుం= ధరించుటకు, వేద= తెలిసికొనునో, సః=ఆమనుష్యుడు, భృతః=పోషింపబడినవాడై, భ్రియమాణః= భరింపబడినవాడగుచు, బిభర్తి=ఇతరులనుపోషించువాడగును.

తా॥ ఇప్పుడు రెండవయర్థమును జెప్పుచున్నారు. వేదముయొక్క యదార్థమును తెలిసినవారు చెప్పినదేమనగా దేహమునుండి ప్రాణములేచివెళ్లినప్పుడు దేహముపడిపోవుటచే మరణమునొందెనని చెప్పుదురు కాబట్టి ప్రాణమేమృత్యువనిచెప్పబడును. ఆప్రాణమే శరీరములోనుండుపర్యంతము జీవించియుండి సర్వవ్యాపారములను జేయును కాబట్టి అమృతస్వరూపమైనదిగాను చెప్పబడును. ఇందునుగురించి కౌషీతకులు చెప్పినదేమనగా ప్రజ్ఞానస్వరూపుడగు యీ ప్రాణమే శరీరమునుధరించి వ్యాపారమునుజేయును. కాబట్టి యీప్రాణమే శరీరమును ధరించునదియగును. యీప్రాణమునేపోషించునదిగాను చెప్పిరి. ఇందునుగురించి ఛాందోగ్యమందు చెప్పినదేమనగా దేనినిభక్షించునో దేనినిత్రాగునో దానిచేతనే యితరప్రాణులనుకూడ పోషించునని చెప్పబడియున్నది కాబట్టి అన్నపానాదులను స్వీకరించి దేహమును జీవింపజేయుటచే పోషించునదిగాను జెప్పబడినది. కాబట్టి యిటువంటి ప్రాణస్వరూపుడగు జీవాత్మను శ్రుతులయందుగాని స్మృతులయందుగాని జెప్పబడిన యోగ్యమగుమార్గముచే తెలిసికొనినవాడు పరమేశ్వరునిచే పోషింపబడుచు ఈప్రాణవాయుచే ధరింపబడినవాడగు తానుయితరప్రాణులనుకూడ పోషించువాడగును.

అథ తృతీయ మంత్రమాహ.

(3) సద్యోజాత ముత జహాత్యేషః । ఉతోజర న్తం నజహాత్యేకం। ఉతోబహూనేక మహర్జహార। అతన్ద్రో దేవ స్సద మేవప్రార్థః॥ 3॥

అథ భాష్యమ్.

అథ తృతీయామాహ॥ 3॥ సద్యోజాతముత—— సదమేవప్రార్థః॥ 3॥ ఇతి। ఏషః- ప్రాణదేవః- స్వతంత్రస్సన్- సద్యోజాతముత- తదానీం చోత్పన్నమపి- పురుషమల్పాయుషం- జహాతి- పరిత్యజతి- ఏకం- అన్యంవా- కంచిత్పురుషం- ఉతోజర న్తం- యతోదీర్ఘాయుషా-జరాం ప్రాప్తమపి- నజహాతి- ఏకమహః- ఏకస్మిన్నేవదినే- ఉతః- బహూన్ లోకానపి- పురుషాన్- జహార- సంహారతి - సోయంప్రాణదేవః- సదమేవ- సర్వదైవ- అతన్ద్రిః- ఉచ్ఛ్వాస నిశ్వాసమరణా మరణ బహుమరణ విషయవ్యాపారేషు- ఆలస్యరహితః- అతోఽయం - ప్రార్థః- అస్మాభిః ప్రార్థనీయః- ఉపాస్యఇత్యర్థః॥

ప్రతిపదార్థం.

టీక॥ సద్యః=ఇప్పుడు, జాతమపి= పుట్టినట్టిమనుష్యునైనను, ఏషః = ఈప్రాణ

